స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...




సంపూర్ణ హాస్య మాస పత్రిక

**జనవరి-2013**

| | |
|---|---|
| Publisher& Editor | : Ramu.P |
| Associate Editor | : Sudharani.P |
| Cartoon Editor | : A.V.M |
| Well Wishers | : Tanikella Bharani<br>Jaydev<br>Mallik |
| Full Pillar | : Bnim |
| Designing | : Creative Graphix |
| Creative Team | : Tumbali Sivaji<br>T.Chandra Sekhar<br>Rampa<br>Surya Dubey<br>P.V.Narayana<br>Ramsheshu<br>P.Priyatham<br>Mallikarjun.U |
| Helper | : Raviteja.S |
| Address | : HASYANANDAM,<br>#8-215/4,<br>Near Ramalayam,<br>Po:YERRABALEM<br>Pin 522 503,<br>Mangalagiri Mandal,<br>Guntur dist. |
| Ph | : 9849630637 |

email: hasyanandam @yahoo.com

| | |
|---|---|
| Hyderabad & Telangana Marketing | : Charminar News Agency,<br>1-6-176/1, M.G.Road,<br>Khandoji Bazar,<br>Secunderabad-3.<br>Ph:9346515813 |
| And | : Shams News Agency,<br>Abids, Hyderabad.<br>Ph:040-30680840/41 |




# హాయ్... సానందంగా...

సూట్‌కేస్‌తో ఇంటికొచ్చిన కూతురితో తల్లి–
"ఏంటే...చెప్పాపెట్టకుండా ఇలా హఠాత్తుగా వచ్చావ్!" అంది.
"మా ఆయనకీ నాకూ పెద్ద గొడవైంది..."
"అయితే...?!" ఆశ్చర్యంగా అడిగిందా తల్లి.
"మొగుడూ పెళ్ళాల మధ్య గొడవైతే ఇద్దర్లో ఎవరో ఒకరు సర్దుకు పోవాలని మొన్నీ మధ్యనే మా ఆయన చెప్పాడు... అందుకే ఇలా 'సర్దుకుని' వచ్చేశా!" అంది ఆ అతి తెలివి కూతురు.



ఇప్పుడు ఎవరికనుగుణంగా వాళ్ళు పరిస్థితులను మార్చుకునేందుకు మహాబాగా ఉపయోగిస్తున్నారీ 'అతితెలివి తెటల్ని'.

మంచి చెడూ... తప్పొప్పులూ... ఇవేవి లెక్కలోకి తీసు కోకుండా 'తొక్కలా' పడేసి 'నేనే రైట్!' అంటున్న ధోరణి ఎక్కడ చూసినా కనబడుతోంది.

అలా మారడానికి కారణం– ఎవరికి వాళ్ళు వాళ్ళదే పై చెయ్యిగా వుండాలనుకునే 'అహంకారం'.

ఒక్క క్షణం ఆ అహంకారాన్ని పక్కనపెట్టి 'విచక్షణ'తో ఆలోచిస్తే 'తప్పు' మనదనుకున్నప్పుడు ఆ తప్పుని ఒప్పుకుని ఆ క్షణాన 'తలవంచుకున్నా'... భవిష్యత్తులో 'తల ఎత్తుకుని' బ్రతికే 'లైఫ్‌స్టైల్' మనదవుతుంది... అన్నది మాత్రం కచ్చితంగా సత్యం!

అహంకారపు అడ్డుగోడలు లేకుండా... అందరూ కలిసిమెలిసి... హాయిగా...ఆనందంగా...ఆరోగ్యంగా... వుండాలని కోరుకుంటూ...

**అందరికీ నూతన సంవత్సర,**
**సంక్రాంతి శుభాకాంక్షలు!**

–రాము.పి
(ఎడిటర్)















అట్టపోసిని: అంజలి
కార్టూన్: లేపాక్షి

## ఎక్కడ ఏ నవ్వులున్నాయో....



### కార్టూన్లు...



## మన జనాలు

..ఏదో మాట వరసకు మన
అమెరికా అల్లుడిని సంక్రాంతి
పండక్కి ఇండియా రమ్మన్నా..
చార్జీలు పంపమంటున్నాడే...



## శ్రీతలిశెట్టిరామారావు జయంతి మే20న
## తెలుగు కార్టూనిస్టుల దినోత్సవం సందర్భంగా
## ఆంధ్రప్రదేశ్ కార్టూనిస్ట్ అకాడమీ, ముఖిమీడియా,
## హాస్యానందం,
## సంయుక్తంగా నిర్వహిస్తున్న

**ఈ పోటీలో కార్టూనిస్ట్ అందరికీ ఆహ్వానం!**

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ.2000/-లు |
| ద్వితీయ బహుమతి | : | రూ.1000/-లు |
| విశిష్ట బహుమతులు (10) | : | ఒకొక్కటి రూ.200/-లు |

ఇంకా ఎన్నో ప్రశంసా పత్రాలు...

నిబంధనలు:

1. కార్టూన్ A4 సైజ్‌లో తప్పనిసరిగ్గా వుండాలి. సబ్జెక్ట్ మీ ఇష్టమే!
2. ఒకరు 4 కార్టూన్లు మాత్రమే పంపాలి.
3. కాప్షన్‌లెస్ కార్టూన్‌లైతే మరీ మంచిది.
4. సెలక్ట్‌కాని కార్టూన్లు తిరిగి పంపగోరువారు తగిన స్టాంపుల కవరు జత పరచాలి.
5. పరిశీలనలో వున్నవి, కాపీ కార్టూన్లు పంపవద్దు.
6. మీ పూర్తి బయోడేటా ఫొటోతో సహా తప్పనిసరిగా జత చేయాలి.



ఈ సందర్భంగా హాస్యానందంలో ప్రచురించిన ది బెస్ట్ కార్టూన్స్ ని పుస్తకంగా విడుదల చేస్తున్నాం!

**కార్టూన్లు మాకు చేరడానికి ఆఖరుతేదీ: 20.3.2013**

కార్టూన్లు 'హాస్యానందం' చిరునామాకు మాత్రమే పంపవలెను.

# ఆ టాపిక్! -ఈ కార్టూన్



ఏ సబ్జెక్టు మీదైనా కార్టూన్ ఆలోచించే ముందు కుదుటగా ఓ చోటు కూర్చుని స్క్రిబుల్ చేయడం మంచిది.

ఆఫీసులో పనుల్లో వున్నప్పుడో, డ్రైవ్ చేస్తున్నప్పుడో, బాత్రూమ్‌లోనో, తట్టిన ఐడియాలను ఎప్పటికప్పుడు కాకపోయినా కొంత వీలు మీద ఒక చిన్న పాకెట్‌డైరీలో నోట్ చేసి పెట్టుకుంటే కార్టూన్ స్క్రిబ్లింగ్‌కు అవి చాలా ఉపకరిస్తాయి.

స్క్రిబుల్ చేసిన గీతల్లోంచి, కార్టూన్‌కు కావలసిన క్యారక్టర్‌లు, ఫోజులు, వ్యాఖ్య ఫైనలైజ్ చేసి, కార్టూన్ స్కెచ్చింగ్‌కు ఉపక్రమించవచ్చు.

సబ్జెక్టు టైటిలు బుర్రలో తట్టినప్పుడు పేపరుమీద రాసేసుకోవాలి.

ఉదహరణకి 'గీత' అనే టైటిలు మీద కార్టూన్లు ఆలోచించాలనుకుందాం. భగవద్గీత; దారిద్ర్యరేఖ; నుదుటిరాత; చారల గుర్రం; లైను వేయడం... నాకు వెంటనే మదిలో తట్టినవివి. ఇక కార్టూనులు గీయడమే తరువాయి.

కార్టూనుకుపక్రమించగానే, విచిత్రంగా మరోకొత్త ఐడియా కూడా తట్టవచ్చు! ఈ 'పిచ్చిగీతల బుజ్జిగాడి' కార్టూను ఆ విధంగా గీసిందే!

**వచ్చే సంచిక... అంటే ఫిబ్రవరి సంచిక ప్రముఖ చిత్రకారులు, కార్టూనిస్ట్ శ్రీచంద్రగారి ప్రత్యేక సంచికగా రూపుదిద్దుకుంటుంది... ఆయన కుంచెల విన్యాసాల విశ్వరూపం హాస్యానందం ఫిబ్రవరిలో ఆవిష్కరిస్తోంది. బీ రెడీ...!**





**చంద్రగారిని మీరు అభినందించాలంటే... ఓ కార్డో... మెయిలో పోస్ట్ చేయండి!**




**హా**స్యానందం డిశంబర్ సంచిక చాలా బాగుంది. ముఖచిత్రం మీద ప్రచురించిన కార్టూన్ నేటితరానికి అర్థంపట్టింది. కార్టూనిస్ట్‌కి హరగోపాల్‌గారికి మా అభినందనలు. -టి.గోపాలకృష్ణ,తెనాలి

**మీ**రు కవర్ చేసిన 'ఆ టాపిక్... ఈ కార్టూన్' చాలా నచ్చింది. ఈ టాపిక్ ఈ బుక్ చదివిన వందమందిలో ఒకరిని... కాదు వెయ్యిమంది లో ఒకరిని కాదు...కాదు పదివేలమందిలోఒకరిని కొత్త కార్టూనిస్ట్‌గా ప్రభావితం చేసినా 'హాస్యానందం' కృషి నూటికి నూరు శాతం సఫల మైనట్లే. ఉదాహరణకు నిరూపణగా కొత్త కార్టూనిస్ట్‌లు మీకు పంపే కార్టూన్లే! ఇంకా ఎన్నెన్నో మంచి మంచి టాపిక్‌లు కవర్‌చేయాలని కోరుతూ... -సురేంద్రనాథ్ నందనవనం,హైదరాబాద్

**హా**స్యానందం డిశంబర్ సంచికలో బాపుగారి జన్మదిన శుభా కాంక్షలు చాలా బాగుంది. రాసిన శ్రీ కె.వి.భీమారావు గారికి, ప్రచురించిన హాస్యానందానికి మా అభినందనలు. ఈ సంచికలో ప్రచురించిన 'నాకేం తెలీదు... నాకేం తెలీదు...' కథ మన నేటి పరిస్థితిని అద్భుతంగా ఆవిష్కరించారు రచయితరామశర్మగారు.. వారికి మా ధన్య వాదాలు. -కె.అనూరాధ, రాజమండ్రి

**బాధ**యాత్ర!... పాదయాత్రలను ఎండగట్టి విధంగా రాసిన ఈ కథ చాలా బాగుంది. జనాలు ఏమనుకుంటున్నారో అని కూడా పట్టిం చుకోకుండా మననాయకులు మనకి సేవచేయ దానికి ఇలా యాత్రలు చేస్తుంటే నిజంగా నవ్వు వస్తోంది. ఇంతకంటే హాస్యం మనకింకెక్కడ దొరుకుతుంది చెప్పండి. ఏదీహో రచయిత సమయస్ఫూర్తికి అభినందిస్తున్నాను.

-పి.కిరణ్ కుమార్, చెన్నై

**డి**శంబర్ హాస్యానందం పత్రిక చాలా బాగుంది.హాస్యానికి పెద్దపీట వేస్తూనే విమర్శ నాత్మకంగా కథలు రాస్తున్న మన రచయితలు ఎంతైనా అభినందనీయులు. ఇలా కథలతో... కార్టూన్లతో...కళకళలాడుతున్న మన హాస్యా నందం ఎల్లప్పుడూ ఇలానే అలరించాలని ఆశీస్తూ... మాకు హాస్యంతో ఆనందం పంచు తున్న మీ(మా) హాస్యనందంకు, నిర్వహాకులకు మా ధన్యవాదాలు.

-ఆర్.రామకృష్ణ, ఖమ్మం

**ప**త్రికని రూపుదిద్దడంలో మీరు చూపుతున్న శ్రద్ధ అభినందనీయం పేజీ గెటప్‌లు చాలా ముచ్చటగా ఉంటున్నాయి. హాస్యానందం పత్రికకి హైలెట్ మల్లిక్కామెడీ కథలు. ఈ కామెడీ కింగ్ పత్రికలలో మన హాస్యానందంలోనే కనిపించడం హాస్యానందంకు ఎస్సెట్! ఇంకా ప్రముఖ కార్టూనిస్ట్‌లందరూ కనిపిస్తున్న పత్రిక ఇదొక్కటే అంటే అతిశయోక్తి కాదు. -ఎ.గోపాలరావు, నెల్లూరు

**హా**స్యానందం మా ఇంటిల్లిపాదికి అభిమాన పత్రిక అయిపోయింది. పేజీలు ఇంకా ఎక్కువ ఉంటే బాగుండేది అన్పిస్తోంది.

-ఆర్.మంజుల, విశాఖపట్టణం

**ము**ఖచిత్రం మీద కార్టూన్ చాలా బాగుంది. ఈ ప్రయోగం చాలా మంచి ప్రయోగం. దీన్ని కంటిన్యూ చేయండి. నవ్వుతకు మారుపేరు హాస్యానందం అని అనుకునేలా రూపుదిద్దుకుంటున్న పత్రిక మన హాస్యానందం. నాలుగుకాలాలపాటు నవ్విస్తూ ఉండాలని మా కోరిక.

-జి.శ్రవణ్‌కుమార్,బెంగళూరు

**మ**న పత్రిక అంటూ మాతో పెనవేసుకుపోయిన మన హాస్యానందం అంటే మాకెంతో ఇష్టం. రోజురోజుకీ ఈ ఇష్టం పెరిగిపోతుంది. పత్రికని మీరు తీర్చిదిద్దుతున్న తీరు ఇందుకు నిదర్శనం. డిశంబర్ సంచికలో చివరి పేజీలో ప్రచురించిన బ్రహ్మానందం ఫొటోలు సింప్లీ సూపర్. ఈ సంచికలో ప్రచురించిన కార్టూన్లు అదియాంటే నమ్మండి!

టి.శ్యామలారాణి,రాజమండ్రి

# రింగ్ల్... రింగ్ల్... బ్నిం

'రింగ్ల్ రింగిల్'... అంటే ఫ్లాష్‌బ్యాక్!

విజువల్స్‌కి ఓ పేరు. ఈ మాట ఖాయ పరిచింది... జంధ్యాలగారని నాకు జ్ఞాపకం.

ఆ 'జ్ఞాపకాల్ని' ఏరుకొచ్చేదే... 'రింగ్ల్ రింగ్ల్'.

ఈ జనవరి రింగ్‌ల్లో నా జ్ఞాపకాలే రాయను గానీ... మీ అందరి రింగ్ల్ రింగ్ల్స్‌నీ కెలికి... చిలికి... రాస్తా. 'అదెలా సాధ్యం' అంటే అదంతే.

నేన్రాసేది... అవునా, కాదా... చెప్పండి! (కనీసం ఊ... అనండి! అనుకోండి!!)

జనవరి నెలలో... చలి కొరుకుతుంది, కుదుపుతుంది... మంచులా కురుస్తుంది. (దుప్పట్లో మూట చుట్టి... మిమ్మల్ని వణికి స్తుంది. మంచం దిగుదామంటే నేలమీద కాలు ఆన్చాలంటే ఛప్పల్ల మేకులు అరికాల్లోంచి... వెన్నుముకదాకా దిగుతాయి. పళ్ళు బిగపట్టి ఆ శీతాలాష్టకష్టాలని తట్టుకుందామంటే... పళ్ళు గజగజకొట్టుకుని వదవదా వణికిం చేస్తాయి.

7... 8... 9.... దాకా పడుకోవాలని పకడ్బందీ నిర్ణయం తీసుకున్నా... సంక్రాంతికి స్వాగతం పలుకుతున్న అద్భుతమైన ఆ ఉద యాలు... ముసుగుబడంగా లేవదీసి, అనా హ్వాంగా కూచోపెడతాయి...

"నను బ్రోవమని చెప్పు... నారీ శిరో మణి..." అంటున్న హరిదాసు పాట... ఆ పాటకి ఏ గాజుల చేతి గలగలలో తాళం వేస్తాయి.

'క్రిష్ణార్పణం..' అని హరిదాసు వెళ్ళాక ఓ రాధో, మాధవో, శారదో, సరస్వతో, తెల్లజార్జెట్ వోణీ వేళ్ళకు చుట్టుకుని ఎదలోని క్రిష్ణున్ని మదిలో ఊహించుకుంటూ ముసిముసిగా నవ్వుకుంటూ వుంటుంది.

తను కూడా చలికి రెండుచేతులూ రాపా డించి వేడి చేస్కుంటున్నప్పుడు ఆ మనోహర రూపం చూడకుండా ముసుగేసుకు పడుకో వడం మీ వల్ల కాదు.

అందుకనే గబుక్కున లేచి... చలిని దుప్పట్లో వుండచుట్టి... గిరవాటేసి బయటికొచ్చి, 'క్రిష్ణా ర్పణం దాసు' అద్దు తొలిగాక, హీరోయిన్‌ని చూసుంటాం (కదూ!) మీ మాటేమోగానీ నేను చూశాను...

అప్పుడే... మొదటిసారి ఆడవాళ్ళకి స్వెట్టర్ అంత బాగోదని అనుకుంటాం... నిన్న ఇంటి ముందు ముగ్గులేస్తున్నప్పుడు లేని ఈ స్వెట్టరు తెల్లారేటప్పటికి తన ఒంటిని ఆక్రమిస్తే ఆక్రో శించడం తప్ప మనం ఏం చేయగలం.

ఇప్పట్లా మా చిన్నప్పుడు ముగ్గుల్లో రింగులు పారబోసి మల్టీకలర్ మార్కులు వేయించుకునే వారు కారు. ఆకుపచ్చకి, పసుప్పచ్చకి మధ్య పేదరంగు వాకిలిలో తెల్లటి చుక్కల మధ్య మెలిదిరిగే అల్లికల వేళ అమ్మాయిల వేళ్ళ నుండి... జాల్వారే ముగ్గుధార ఎంత బావుం డేది?

మనం చూశ్శేదు గానీ వ్రేపల్లెలో పాలు పితికే గోపెమ్మల చేతివేళ్ళ మధ్యనుంచి పారు తున్న తెల్లటి ధారలు అలాగే అనిపించేవేమో...

వోణీని సన్నటి నడుం చుట్టూ తిప్పి ముందుకు తెచ్చి నడుముకి ఓ పక్క గుచ్చిన కొంగు మూరెడు ముక్క... సొగసుని మూట కట్టి చెక్కుకున్నట్లు వుండేవి.

ఇప్పట్లా చుడీదార్ పైజామాలు పల్లెల్లోకి దిగబడలేదు. పల్లెల్లో పైటకొంగులు గ్లామర్ జెండాలు ఎగరేస్తున్నట్లు రెపరెపలాడుతుండేవి.

ఓణీతో పోటీ పడి బారెడు జడ సెల్యూట్ చేస్తుండేవి.

నేను ప్రతీ సంక్రాంతి రోజునీ... రింగుల్... చుట్టుకొస్తుంటా.

పట్టుమని పది సంక్రాంతులు పల్లెల్లో గడి పామో లేదో తెలీదు. జీవితాన్ని జీతాలకి తాకట్టుపెట్టి... కలర్‌ఫుల్ కలలన్నీ మూడు ముళ్ళతో సీల్ వేసేసి మనం జ్ఞాపకాల్లో ముడు చుకుపోతాం.

అప్పుడైతే మీగ్గుర్తుందో లేదోగానీ... భోగి మంటల్లో తన చెల్లాయిల్తో బాటు 'మన చెలి యలు' వచ్చి... ఆవుపేడతో చేసిన పిడకల



దండలు మంటల్లో వేయిస్తారు. వాళ్ళు పిడకల దండలు మనముందు ముట్టుకోడానికి యమ మొహమాటం నటిస్తారు. మనముందు ఫోజు!!

ఆ పిడకల మేన్‌ఫేక్చరింగ్ స్కిల్, దండలని గుచ్చిన టెక్నీక్సు అంతా సోకాల్డ్ సొగసుకత్తెలదే! పైటకొంగు ముక్కుకి అడ్డెట్టుకుని...దండలు వేయించి పసుపు నారెంజల రంగుల మంటల వెలుగులు అందమైన ముఖాల్ని ముద్దాడుతుంటే... మన దుప్పటీ కాలినా, వళ్ళు చుర్రుమంటున్నా మనకి తెలిసేదికాదు.

ఆ తర్వాత ఒకళ్ళు వండుకున్న పులిహోరలు మరొకళ్ళ ఇళ్ళకి పంపడాలు... 'మేము ఆవ వేశాం'అని అత్తమ్మ, 'మేం ఇంగువ దట్టించాం' అని ఇంకో అమ్మ. ఈ కొరియర్ సర్వీసంతా కొంటెగాళ్ళదీ, కోణంగిగాళ్ళదీ... ఇచ్చిపుచ్చుకున్న పులిహోర రుచులు ఎవరికి కావాలి?

తెచ్చి ఇచ్చివెళ్ళిన కోణంగిలే యమటేస్టు అన్పించేది.

ప్రతీ చెట్టువేళ్ళూ భూమిలోనే వుంటాయి. ప్రతీ వాళ్ళ బాల్యం పల్లెల్లోనే వుంటాయి. కొన్ని ఇళ్ళల్లో... క్రితం జనరేషన్ నుంచి సిటీల్లో పిల్లలు పుట్టి పెరుగుతున్నారు గానీ... ఎక్కువ మంది పిల్లలు అమ్మమ్మగారి పల్లెటూళ్ళల్లో పుట్టినవాళ్ళే.

ఇంతగా గుప్పెట్లో గ్లోబు ఇమిడిపోయింది కానీ.. ఆ తరం పెద్దవాళ్ళ గురించి... చదువుతున్నప్పుడు జన్మస్థలం పేరు చూస్తే నూటికి 96 మంది పుట్టింది పల్లెటూళ్ళల్లోనూ.

అమెరికాలో పుట్టినా ఆత్రేయపురంలో పుట్టినా... పుట్టిన చోటువల్లనే 'గ్రీన్‌కార్డ్' అయినా వస్తుంది. జీన్స్ వేల్యూ అయినా వస్తుంది. ఎక్కడెక్కడో వుంటాం... ఏ ఏ ఊళ్ళకో పొట్ట పట్టుకుని బతికేస్తుంటాం.

అప్పుడప్పుడు... గతాల రింగ్ రింగ్‌ల్లోకి వెళ్ళడంలో ఓ కిక్కు వుంటుంది.

అయితే... 'గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్' అనుకోద్దు... 'మంచి గతమున కొంచెమేనోయ్' అనద్దు.

"పురాణమిత్యేవ నసాధుసర్వం..." అని కాళిదాసు అన్నట్లు గతము మాత్రమే అంతా తీపి వుండును అనుకోనూ అక్కర్లేదు.

రింగ్‌ల్... రింగ్‌ల్ చూసి ఉత్తేజితులవుతాం కదా!... అవునా కాదా?

ఊ... అనండి...!

# పండగొచ్చేసింది....






# మల్లిక్ కామెడీ కథలు



## కథ సుఖాంతం

కోటేశ్వరరావు భార్య కాంతామణికి నెలలు నిండాయ్. ఆమె లేక లేక గర్భం ధరించింది.

అందుకనే ఆ భార్యాభర్తలిద్దరూ యమ సంతోషంగా వున్నారు.

"ఏవండి... మీకేం కావాలి?"

పేపర్ చదువుకుంటున్న భర్తని ప్రశ్నించింది కాంతామణి.

"నాకు అమ్మాయ్ కావాలి..." పేపర్ పక్కన బెట్టి గారాలు పోతూ అన్నాడు కోటేశ్వరరావు.

"ఏం... ఇప్పట్లో నేను పనికిరాననా వెధవ్వేషాలు?" కోపంగా అంటూ నెత్తిన 'ఠక్'మని మొట్టింది కాంతామణి.

"హయ్యో రామా! ఇదెక్కడి గోల! అమ్మాయ్ అంటే పడుచుపిల్ల అని కాదు... నాకు పాప కావాలని అర్థం..." అంటూ కాంతామణి పొట్ట కేసి చూపిస్తూ అన్నాడు కోటేశ్వరరావు

"ఆ... ఆ... మీరు చెప్పినవాళ్ళని కనడానికి నేను తేరగా వున్నానిక్కడ... నేను అబ్బాయ్‌నే కంటా..."

"ఊహూ! అమ్మాయ్‌నే కనాలి!!..." గారాలు పోతూ కాంతామణి చెయ్యి వెనక్కి మెలితిప్పి చిలిపిగా వీపుమీద ఒక గుద్దు గుద్దాడు కోటేశ్వరరావు.

"అబ్బా ఆశ... నేను అబ్బాయ్‌నే కంటా..." అంటూ కోటేశ్వరరావు జుట్టు పీకి చెంపమీద ఓ చరుపు చరిచింది కాంతామణి కొంటెగా.

"కాదు అమ్మాయే!..." కోటేశ్వరరావు కాంతామణి జడ పైకెత్తి ఓ జల్లకాయ్ కొట్టాడు.

"కాదు... కాదు! అబ్బాయే!!" అంటూ కాంతామణి కోటేశ్వరరావు కాలుపట్టి లాగి కిందపడేసి పకపకా నవ్వింది.

"అమ్మాయే అమ్మాయే అమ్మాయే..." కింద నుంచి లేచి సోఫాలో కూర్చుంటూ అన్నాడు కోటేశ్వరరావు.

"మనకీ వాదన రోజూ వుండేదేగానీ... చెప్పండి ఏం కావాలో..."

"చెప్పాగా... అమ్మాయ్ కావాలని!!"

"అబ్బా! నేను అడిగేది దాని గురించి కాదు. మీకు కాఫీ కావాలా... టీ కావాలా అని అడుగుతున్నా..." నెత్తికొట్టుకుంటూ అంది కాంతామణి.

"నాకు కాఫీ కావాలి..."

కాంతామణి భర్తకి కాఫీ తెచ్చి ఇచ్చింది.

అతను కాఫీ తాగిం తర్వాత కాంతామణి అంది– "ఏవండీ... ఈ నెల డాక్టర్ దగ్గరికి చెకప్ కోసం వెళ్ళలేదు."

"ఇప్పుడే వెళ్దాం... నువ్వు తయారవ్వు" సోఫాలోంచి లేస్తూ అన్నాడు కోటేశ్వరావు.

ఇద్దరూ బట్టలు మార్చుకుని లేడీ డాక్టరు సీతాలు దగ్గరికి వెళ్ళారు.

డాక్టర్ సీతాలు కాంతామణిని పరీక్షించి మొదట పెదవి విరిచింది...తర్వాత ఫకాల్మని హాయిగా నవ్వేసింది.

ఆవిడ అలా ఎందుకు చేసిందో అర్థంకాక ఇద్దరూ వెర్రిమొహాలేస్కుని చూశారు.

"మొదట మీరెందుకు పెదవి విరిచారు... ఆ తర్వాత ఫకాల్మని ఎందుకు నవ్వారు?... చెప్పరా... ప్లీజ్!" అన్నాడు కోటేశ్వరావు చేతులు జోడిస్తూ.

"అదా?... వెరీ సింపుల్... పెదవి ఎందుకు విరిచానంటే ఆవిడ గర్భంలో బిడ్డ అడ్డం తిరిగింది. మరేమో... ఫకాల్మని హాయిగా ఎందుకు నవ్వానంటే మరి బిడ్డ అడ్డం తిరిగిందిగా... అలా అడ్డం తిరిగితే మా నర్సింగ్‌హోంలోనే సిజేరియన్ ఆపరేషన్ చేసి బిడ్డని బయటికి తీస్తాంగా. అందుకు! హి... అసలు ఈ బిడ్డలు మా మెటర్నిటీ హోంలని పోషించడం కోసమే అడ్డం తిరిగిపోతుంటారు... హిహి" అంది డాక్టర్ సీతాలు ఉప్పొంగిపోతూ.

"ఏవండీ! ఆపరేషన్ చేసే తీరాలంటారా?" నీళ్ళు నములుతూ అడిగాడు కోటేశ్వరావు.

"అమ్మో... చెయ్యకపోతే చాలా ప్రమాదం. తల్లీబిడ్డా ఇద్దరూ గోవిందా గోవింద!" అంది సీతాలు.

వాళ్ళిద్దరి మొహాలూ పాలిపోయాయ్. వాళ్ళ భయాన్ని గమనించి సీతాలు ముసిముసిగా నవ్వుకుంది.

"మీ బిడ్డింకా నయం... కేవలం అడ్డం తిరిగాడు... మొన్నీ మధ్య బాగా డబ్బుండే ఒకావిడ బిడ్డేమో గర్భసంచిలో ఏకంగా మొగ్గలే వేస్తున్నాడు. ఇలా అయితే చాలా ప్రమాదం



అని చెప్పి ఆపరేషన్ చేసి బిడ్డని బయటికి తీసేశాను. వాళ్ళు నాకు అయిదువేలిచ్చారు. మీకు అంతెక్కువేం అవదు. మీ బిడ్డ కేవలం అడ్డం తిరిగాడు కాబట్టి మూడువేలు అవుతుంది..."

"అలాగే డాక్టరుగారూ... మేమింక వస్తాం" నీరసంగా అన్నాడు కోటేశ్వర్రావు.

"అలాగే గానీ... మీ క్రాపు చాలా బాగుందండీ.... చక్కగా బఫ్ వచ్చేలా దువ్వుకున్నారు." అంది డాక్టర్ సీతాలు అతని క్రాపు వంక మెచ్చుకోలుగా చూస్తూ.

"మా ఆయన్ని కూడా ఇలానే దువ్వుకోమంట..."

"బఫ్ఫూ కాదు నా బొంద కాదు. ఇందాక మా ఆవిడ బొడిపె వచ్చేలా మొట్టింది. అందుకే అక్కడ ఎత్తుగా అలా లేచింది..." సిగ్గుపడుతూ అన్నాడు కోటేశ్వర్రావు.

"అవునా!... బాగుందే!!! ఈరోజు ఇంటికెళ్ళిం తర్వాత నేను కూడా ఆయన్ని గట్టిగా మొట్టా..." సంబరంగా అంది డాక్టర్ సీతాలు.

కాంతామణి, కోటేశ్వర్రావులు సీతాలు దగ్గర శలవు తీసుకుని ఇంటికెళ్ళారు.

"డాక్టరు చెప్పింది విన్నాక నాకు చాలా డల్‌గా వుందండీ... మనసంతా చికాకు చికాకుగా వుంది. అందుకని ఎక్కడికైనా లాంగ్ డ్రైవ్‌కి వెళ్దామండీ... కోటేశ్వర్రావు గుండెల మీద వెంట్రుకలు పీకుతూ అంది కాంతామణి. కోటేశ్వర్రావు బాధగా ఓ కేక పెట్టాడు.

"సినిమాల్లో చూడ్లేదూ? నవలల్లో చదవలేదూ?? ఏదైనా చెప్పదల్చుకున్నప్పుడు ఛాతీ మీద వెంట్రుకలు మెల్లగా లాగుతూ చెప్తారు... నువ్వేంటి గడ్డి పీకుతున్నట్టు పీకుతున్నావ్?" పళ్ళు కొరుకుతూ అన్నాడు కోటేశ్వర్రావు.

"సారీ అండీ!... ఇహనుండి మెల్లగానే పీకుతాను సరేనా?"

"నువ్వేం పీకక్కర్లేదు.. మనం వెళ్దాం పద!" అన్నాడు కోటేశ్వర్రావు కాంతామణి చేతిని ఛాతీమీదనుంచి లాగేస్తూ.

ఇద్దరూ ఇంటి దగ్గరనుంచి కార్లో బయలుదేరారు.

"ఎక్కడికి వెళ్దాం?" అడిగాడు కోటేశ్వర్రావు.

"ఎక్కడికైనా పర్లేదు... దూరం అలా అలా తిప్పుకుని రండి" చెప్పింది కాంతామణి.




కారు ఒక ఫర్లాంగు దూరం మామూలుగా నడిచింది. తర్వాత ఉన్నట్టుండి ఎగిరి జంప్ చేసింది.

ఆ కుదుపుకి కాంతామణి ఎగిరి ముందుకు పడి మళ్ళీ సర్దుకుని కూర్చుంది.

"ఏంటీ... ఏదైనా సర్కస్ కంపెనీలో పని





చెయ్యాలని అనుకుంటున్నారా? కారు సరిగ్గా నడపండి" విసుక్కుంది కాంతామణి.

"నేను సరిగ్గానే నడుపుతున్నా.." గొణిగాడు కోటేశ్వర్రావు.

కారు మరికాస్త దూరం సాఫీగానే నడిచింది. తర్వాత ఉన్నట్టుండి గంతులేస్తూ నడవడం మొదలెట్టింది.

"ఏంటిది... మనం కార్లో వెళ్తున్నామా లేకపోతే గుర్రంమీద వెళ్తున్నామా?" కంగారుగా అడిగింది కాంతామణి.

"హిహిహి..." నవ్వాడు కోటేశ్వర్రావు

"ఏంటా ఇకిలింపు కారు సరిగ్గా నడపకుండా?"

"నేను సరిగ్గానే నడుపుతున్నా.. రాత్రి పెద్ద వర్షం పడిందిగా... అందుకే కారిట్లా నడుస్తుంది."

"వర్షం పడ్డానికీ కారిలా నడవడానికీ ఏంటి సంబంధం?" అయోమయంగా ప్రశ్నించింది కాంతామణి.

"మరి వర్షం పడ్తే రోడ్లు గుంతలుపడిపోయి పాడైపోతాయ్‌గా... అందుకని."

"హావును కదూ?.. ఆ విషయమే మర్చిపోయా..." అంటూ ఫక్కున నవ్వింది కాంతామణి.

కారు కొంతదూరం జజ్జనకిడి... జజ్జనకిడి అని గంతులేస్తూ వెళ్ళిన తర్వాత కొందరు వ్యక్తులు రోడ్డుకు అడ్డుపడి కారాపారు.

"ఏంటి సంగతి?" అన్నట్టు వాళ్ళవంక చూశాడు కోటేశ్వర్రావు.

"రాత్రి బాగా వర్షం పడింది కదండీ...

అందుకని ఆ ఎదురింటాయన ఈ దారిన పోయే అందరికీ స్వీట్లు పంచమని ఇచ్చా రండీ" ఒక యువకుడు చెప్పి ఇద్దరికీ చెరొక స్వీటు ఇచ్చాడు.

"ఏం ఆయనేమైనా రైతా?..." అడిగాడు కోటేశ్వరరావు.

ఆ ప్రశ్న వినగానే ఆ యువకుడు ఫక్కున నవ్వాడు.

"ఆయన ఈ రోడ్లు వేసిన ఇంజనీర్ సార్. రాత్రి వర్షానికి రోడ్లు కొట్టుకుపోయాయ్‌గా... మళ్ళీ ఈ రోడ్లు వెయ్యడానికి కాంట్రాక్టు ఆయనే సంపాదించి ఇలాంటి రోడ్లే మళ్ళీ వేసి బోల్డు సంపాదిస్తాడంట సార్... అందుకే ఆయన సంతోషంకొద్దీ ఇలా ఈ రోడ్డమ్మట వెళ్ళే అందరికీ స్వీట్లు పంచుతున్నారు సార్..."

అది వినగానే ఇద్దరూ ముక్కున వేలేస్కుని నోట్లో స్వీటు పెట్టుకుని ముందుకు వెళ్ళారు. కారు ఇంకొంతదూరం 'గుర్రంలా' వెళ్ళింది. మధ్య మధ్యలో ఎగిరిపడ్తూంది.



కొంతదూరం రాగానే రోడ్డుకి అడ్డంగా ఒక గుంపులో జనం రంగులు చల్లుకుంటూ కేరిం తలు కొడ్తూ నాట్యం చేస్తున్నారు.

"ఏంటయ్యా ఈ ఉత్సవం?" కారాపి గుంపు లోని ఓ మనిషిని అడిగాడు కోటేశ్వరరావు.

"రాత్రి వర్షం పడి రోడ్లు కొట్టుకుపోయాయ్ కదండీ... అందుకని పండగ చేస్కుంటున్నాం. మేం కూలీలం సార్... కొట్టుకుపోయిన రోడ్ల వెయ్యడం, గుంతలు పడ్డ రోడ్ల మరమ్మత్తు చెయ్యడం మాకు చేతినిండా పని సార్... సంతోషంగా చెప్పాడు ఆ కూలివాడు.

"బాగుంది... చాలా బాగుంది..." అని కారుని ముందుకు పోనిచ్చాడు కోటేశ్వరరావు.

ఒక ఫర్లాంగు దూరం వెళ్ళాక రోడ్డు పూర్తిగా మాయం అయిపోయింది.

"ఇక్కడినుండి రోడ్డు రెండు కిలోమీటర్ల దాకా పూర్తిగా కొట్టుకుపోయిందండీ..." దారిన పోయే దానయ్య కోటేశ్వరరావుతో చెప్పాడు.

కారుని వెనక్కి తిప్పి ఇంటికి గుర్రంలా పోనిచ్చాడు కోటేశ్వరరావు.

కోటేశ్వరరావు కారు దిగాడు. అతని వెనకాలే కాంతామణి కూడా కారు దిగింది.

ఆమె చేతిలో ఒక పసిబిడ్డ!!

"ఇదేమిటి? ఇదెక్కడిదీ???..." ఆశ్చర్యంగా అడిగాడు కోటేశ్వరరావు.

"ఎక్కడిదేమిటండీ... వీడు మన బిడ్డే! ఈ దిక్కుమాలిన రోడ్ల పుణ్యమా అని ఆ కుదుపు లకి నేను కార్లోనే కనేశాను..." సిగ్గుపడ్తూ చెప్పింది కాంతామణి.

"గుంతలుపడి కొట్టుకుపోయిన రోడ్లమీద కారు జాగ్రత్తగా నడుపుతూ ధ్యాసంతా మీరు రోడ్డుమీద వుంచారు. అందుకే గమనించ లేదు."

"యాహూ..."

మూడువేల రూపాయల ఆపరేషన్ ఖర్చు తప్పినందుకు సంతోషంతో అరిచాడు కోటేశ్వ రావు.








ఏవీఎమ్

# మనవాళ్ళు


పిల్లా! టి.వీ సీరియల్ టైపుగా
కాపురం చెయ్యాలా! పాత టైపుగా నా!?
అంటే!?


పాత టైపు అంటే.. వంటచెయ్యడం, పిల్లలను
కని పెంచడం, నీ జేబులో డబ్బు కొంత
నొక్కేయడం.. ఇలాకావాలంటే పెళ్ళికి
ఆర్నెల్లు ఆగాలి!
ఇదంతా ట్రైనింగ్
ఇవ్వాలి!...


అమ్మో! ఆర్నెల్లా!.. నేనాగలేనూ..
టి.వీ సీరియల్ టైపులో చెయ్యండి
పెళ్ళి..! కాపురం!!


ఆ టైపులో ఐతే కట్నం వుండదూ!
నువ్వు బుద్ధిగా వుంటే "విడాకులు" వుంటాయ్!
AVM



# పెళ్ళిఫోటో

జయలక్ష్మిరాజు

**కొత్త సీరియల్ ప్రారంభం!**

"వక్రతుండం మహాకాయం కోటి సూర్యసమప్రభ"

నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా!"

"పావనీ! కృష్ణా! త్వరగా వచ్చి కళ్ళకద్దుకోండి. ఏమండీ! మీరుకూడా!... సర్వమంగళ మాంగళ్యే శ్రియే సర్వార్థ సాధికే దేవీ త్రయంబకే నారాయణీ నమోస్తుతే" శ్లోకాలు చదువుతూ హారతి ఇస్తూ... పూజగదిలో అష్టావధానం చేస్తోంది శ్రీవల్లి! హారతి కళ్ళకద్దుకున్నాడు సుబ్బారావు.

"మమ్మీ! ఈ రోజు సాయంకాలం సుకన్య మనింటికొస్తానంది. నిన్ను చూడాలనిపిస్తోందట. ఏదైనా వెరైటీ టిఫిన్ చెయ్యవా ప్లీజ్!" కృష్ణ బ్రతిమిలాడుతూ అన్నాడు.

"అలాగేలేరా!" నవ్వింది శ్రీవల్లి.

"థాంక్యూ మమ్మీ! నే వెళ్లొస్తా!" అంటూ బైక్ స్టార్ట్ చేసుకుని వెళ్లిపోయాడు కృష్ణ.

"అమ్మా! నేనూ కాలేజీ కెళ్ళొస్తాను" పుస్తకాలు సర్దుకుంటూ అంది పావని.

"బస్సుకింకా అయిదు నిమిషాల టైముంది. ఇప్పటినించే వెళ్ళి రోడ్లో నిల్చోవాలా... ఓ నిమిషం ముందు వెళుదూగాని... ఆగు!" చిరాగ్గా అంది శ్రీవల్లి.

"అర్థం లేకుండా మాట్లాడకు. నువ్వెళ్ళమ్మా పావనీ!" కూతుర్ని సపోర్టు చేశాడు సుబ్బారావు.

"మీరీ మధ్య నేనేం మాట్లాడినా తప్పులెంచుతున్నారు" కోపంగా అంది శ్రీవల్లి.

"నువ్వన్నీ తప్పుగా అర్థం చేసుకుని తప్పుగా మాట్లాడుతున్నావుమరి! ఆడపిల్లకో న్యాయం... మగపిల్లాడికో న్యాయం... పాతకాలపు సగటు స్త్రీలా ప్రవర్తిస్తున్నావు. అమ్మాయికి ఇరిటేషన్ తెప్పిస్తున్నావు నేను గమనిస్తున్నాను. అమ్మాయి కూడా అర్థం చేసుకునే వుంటుంది. బాధపడుతుందన్న ఆలోచన లేదా నీకు?"

"అబ్బాయి కథ వేరు! అమ్మాయిలు వేరు. అందులోనూ ఈ కాలం అమ్మాయిలు వేరు. తెలివిగా ఉన్నట్లే వుంటారు. పప్పులో కాలేస్తారు. టి.వి.ల్లో, పేపర్లో చూడ్డంలేదా? ఎంత మంది అమ్మాయిలు అబ్బాయిల మోసానికి బలైపోయి ఆత్మహత్యల పాలవుతున్నారో... కాలం ఎంత మారుతున్నా. . ఈ విషయంలో మాత్రం మార్పు రావటంలేదు. తల్లిగా నా బాధ నాది. అర్థం చేసుకొంటే మంచిది" విసురుగా చేతిలో వస్తువు నేలమీద విసిరి, కోపం వ్యక్తం చేస్తూ అక్కడినించి వెళ్లిపోయింది శ్రీవల్లి.

శ్రీవల్లి మాటలు నెమరువేసుకుంటూ వుండిపోయాడు సుబ్బారావు. ముభావంగా వుండిపోయిన సుబ్బారావు దగ్గరికి చాలాసేపటి తర్వాత శ్రీవల్లి వచ్చి "ఏంటలా కూర్చున్నారు. స్నానం చెయ్యండి! టిఫిన్ తినేద్దాం" అంది శ్రీవల్లి.

◆ ◆ ◆

పావని సాయంకాలం కాలేజీనించి ఇంటికొచ్చేసరికి హాల్లో సోఫాలోకృష్ణ, సుకన్య ప్రక్కప్రక్కన కూర్చుని ఒకరి చేతిలో మరొకరు చేతులుంచుకుని జోకులేసుకుంటూ నవ్వుకుంటూ మాట్లాడుకుంటున్నారు.



పావనిని చూడగానే సుకన్య "హాయ్... పావనీ!" అంది.

"హాయ్!" అంది పావని.

"రా! రా! ఇలా కూర్చో! పావనీ! కాలేజీకి సిన్సియర్‌గా వెళ్లి బుద్ధిగా పాఠాలు చదువుకుంటున్నట్టున్నావు" జోకేశానన్నట్టు కిలకిలా నవ్వింది సుకన్య.

ఫార్మలిటీ నవ్వొకటి నవ్వేసి "కాస్త ఫ్రెష్ అయి వస్తాను ప్లీజ్!" అంటూ తప్పుకుంది పావని.

"మీ చెల్లి ఇంకా లవ్‌లో పడలేదు కిట్టూ! పాపం" అంటూ మళ్లీ నవ్వింది సుకన్య.

"చాల్లే! ఊరుకో! అది వింటే ఊరుకోదు. సుడులు తిరిగి పడిపోయేలాంటి డైలాగేస్తుంది తెలుసా" కృష్ణ అన్నాడు.

"అలాగా! అంత టాలెంటుందా?..." మళ్ళీ కిలకిలా నవ్వింది సుకన్య.

వాళ్ళను దాటుకుని వచ్చేసిన పావని వంటింట్లోకి తొంగిచూసింది.

'కాబోయే కోడలికి వెరైటీ టిఫిన్ చేస్తూ వంటింట్లో కుస్తీపడుతోంది అమ్మ పాపం' అనుకుంటూ నాన్నగదిలోకి తొంగిచూసింది. బాటసారి సినిమాలో నాగేశ్వరరావులాగా తనమట్టుకు తాను రాసుకుంటున్న తండ్రిని చూసి నాన్న అర్జంటుగా కామెడీ కథ రాస్తున్నాడు కాబోలు అనుకుంటూ తన గదిలోకెళ్ళి పుస్తకాలు ప్రక్కన పడేసి ఫ్యాన్ స్విచ్ వేసి మంచంమీద పడుకుంది.

హాల్లోంచి నవ్వులు... అమ్మ పరామర్శలు... టిఫిన్‌గురించి పొగడ్తలు... వినిపిస్తూనే వున్నాయి.

తననుగానీ, నాన్ననుగానీ వాళ్ళు పిలవలేదు. వాళ్ల ధోరణి వాళ్లదే!



వాళ్ళిద్దరూ సరే. అమ్మేమిటి ఇలా ప్రవర్తిస్తుంది! అసలుతనంటే అమ్మకు ప్రేమలేదు. పాతకాలపు మనిషిలా, చదువురాని దానిలా అన్నయ్యనోరీతిగా, తననో రీతిగా చూస్తుంది. తనకు అన్నీ నిబంధనలూ,కట్టుబాట్లు, ఆచారాలు అంటూ వల్లె వేస్తుంది. అన్నయ్య తనో అమ్మాయిని ప్రేమించానంటూ చెప్పిందే తడవు ఆ అమ్మాయిని చూడటం, వాళ్ళ పెద్దవాళ్ళతో పరిచయాలు చేసుకోవటం...ఇద్దరి ఇళ్ళకూ రాకపోకలు, విందు వినోదాలు... మర్యాదలు... వాళ్ళిద్దరి చదువులు ఇంకా రెండేళ్ళ దాకా పూర్తికావు. అన్ని విషయాల్లో అడ్వాన్స్‌డ్‌గా ప్రవర్తిస్తున్నారు. తన విషయం దగ్గరకొచ్చే సరికి కుదించేస్తారు.

ఇలాంటివాళ్ళు తన ప్రేమ విషయాన్ని అంగీకరిస్తారా? సాగర్‌తో తన కుటుంబ సభ్యుల మనస్తత్వాల గురించి ఎలా చెప్పటం? అయినా ఇప్పుడప్పుడే చెప్పే అవసరమూ లేదు. ముందు తన చదువు పూర్తయి తనకో సంపాదన ఏర్పడాలి.

సాగర్ విషయమూ అంతే! ఇదంతా జరగాలంటే కనీసం మూడేళ్ళు పట్టచ్చు. అప్పటి సంగతి చూద్దాం. అనవసరంగా ఆలోచించి టైం వేస్టు చేసుకోవడమెందుకు? తనకు తానే సంబాళించుకుని లేచి వెళ్లి ఫ్రెష్ అయ్యి హాల్లో కొచ్చింది. అక్కడ నాన్న ఇంకా చేరకపోవటం చూసి ఆయన గదిలోకెళ్ళింది పావని.

"ఏమిటి నాన్నగారూ! ఏదైనా కాంపిటీషన్‌కు పంపుతున్నారా? పదిహేను రోజుల నించి గది దాటి రావటం లేదు" అంటూ సుబ్బారావు కూర్చున్న టేబిల్ ముందుకు మరో కుర్చీలాక్కుని కూర్చుంది.

"అదేం లేదమ్మా! ఓ నవల మొదలెట్టాను.

అది పూర్తయ్యేదాకా నాకు నిద్రపట్టదని నీకు తెలుసు కదా! అందుకే గది వదలటం లేదు. పెన్ను ప్రక్కన పెడుతూ అన్నయ్య స్నేహితులు ఇంకా వెళ్ళినట్టు లేదు కదా" టాపిక్ మారుస్తూ అన్నాడు సుబ్బారావు.

"వాళ్ళ సంగతి సరేలెండి! ఇంతకీ నవల ఎప్పుడు పూర్తవుతుంది? నన్ను ఫెయిర్ చెయ్యమంటారా?"

"వద్దులే...ఏకంగా రాసేస్తున్నాను!"

"అదేమిటి మీరెప్పుడలా చెయ్యరే? ఏకంగా రాసేస్తే మార్పులు చేర్పులు ఎలా?"

"అదంతేలే! దాన్ని గురించి తర్వాత చెబుతా గానీ... నీ చదువెలా సాగుతోంది? ఈ మధ్య మూడీగా వుంటున్నావెందుకు... నేను నిన్ను గమనిస్తున్నాను!"

"అలాంటిదేం లేదు నాన్నా!"

"లేదు! నీవు దేన్నిగురించో ఆలోచిస్తున్నావని అనిపిస్తోంది."

"అబ్బా! అదేం లేదు నాన్నా! రండి... హాల్లోకి వెళదాం" అంటూ తండ్రిని లేవదీసింది. ఇద్దరూ హాల్లోకొచ్చారు.

"రండి అంకుల్! మీరు రాతలో పూర్తిగా మునిగిపోయి వున్నారు. డిస్టర్బ్ చెయ్యటమెందుకని మిమ్మల్ని పలకరించటానికి రాలేదు" అంది సుకన్య లేచి నిలబడి చేతులు జోడిస్తూ.

"కూర్చో సుకన్యా!... అమ్మా నాన్న బావున్నారా?... మీ తమ్ముడు పరీక్షలు బాగా రాశాడా?" కుశలప్రశ్నలు వేశారు సుబ్బారావు.

"అందరూ బావున్నారంకుల్! ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు రచయితలందరూ మీలాగే వుంటారా అంకుల్" చనువుగా అడిగింది సుకన్య.

"అంటే? నా వేషధారణ ప్రత్యేకంగా కనిపిస్తోందా అమ్మా!"

"వేషం కాదంకుల్! మాట తీరు. మీ మాటల్లో ఎప్పుడో తప్ప ఇంగ్లీషుపదం దొర్లదు. మీరు మాట్లాడే పదాలను ఒక్కోసారి... కాదు చాలాసార్లు ఇంగ్లీషులోకి ట్రాన్స్‌లేట్ చేసుకుంటే తప్ప అర్థం కావు" అంది సుకన్య నవ్వుతూ.




"ఓ! అదా! మనం తెలుగువాళ్ళమన్న సంగతి మాలాంటి పెద్దవారైనా అప్పుడప్పుడు మీకు గుర్తుచేయాలి కదా!"

"మీరింత సీరియస్‌గా కనిపిస్తారు. మీరు కామెడీ కథలు, నవలలు రాస్తారంటే అస్సలు నమ్మలేం అంకుల్!"

"అసలు హాస్యం పుట్టేది సీరియస్‌లోంచేనమ్మా! సరే! నేనలా బయటకెళ్ళొస్తాను... కృష్ణా! మాటల్లో పడి మరిచిపోయేవు గ్యాస్ సంగతి చూడు. మీ అమ్మ ఇబ్బంది పడుతుంది. పావనీ! నువ్వు ట్యూషన్ ఫీజు కట్టాలన్నావుగా టేబుల్ సొరుగులో డబ్బుంచాను తీసికెళ్ళు" అంటూ వెళ్ళిపోయాడు సుబ్బారావు.

"అంకుల్! టిఫిన్ తినకుండానే వెళుతున్నారే" అంది సుకన్య.

"ఆయన ఈ టైంలో తినరు సుకన్యా! మీరు మాట్లాడుతుండండి టీ తెస్తాను..." అంటూ లేచింది శ్రీవల్లి.

పావని సుకన్యతో మాట్లాడుతూ టిఫిన్ తినసాగింది.

"పావనీ! ఇలారా!" శ్రీవల్లి కేకేసింది.

"ఏమిటమ్మా!" అంటూ వంటింట్లోకెళ్ళింది.

"ఎంతసేపలా వాళ్ళిద్దరి మధ్య కూర్చుని కబుర్లాడతావు! అన్నయ్యకు కోపం వస్తుంది. నీ గదిలోకెళ్ళి చదువుకో" సీరియస్‌గా కసిరినట్టు మాట్లాడింది.



వళ్ళు మండిపోయింది పావనికి.

"వాడికోప్పం రావడమేమిటి? వాడు చేసే చేష్టలకు నాకు కోపం రావాలిగానీ! ఇంట్లో ఎదిగిన చెల్లెలుందన్న సంగతి కూడా గుర్తు లేకుండా లవ్వర్‌ని ఇంటికి తీసుకొచ్చి గంటల గంటలు హస్కు వేసుకోటం, ఇక ఇకలు, పక పకలు. మనమేమన్నా రాయల్ ఫ్యామిలీ నించి ఊడిపడ్డామా? మధ్యతరగతి త్రిశంకుగాళ్ళం. ఇరుగూ పొరుగూ ఏమన్నా అనుకుంటారని జంకూ గొంకూ లేదు. ఆ పనికిమాలిన వాడికి నువ్వు సపోర్టు. మధ్యన ఓ పదినిముషాలు కూర్చున్న నాకు మాత్రం తిట్టు" గట్టిగా అర వాలనుకుంది పావని.

ఏమీ మాట్లాడలేకపోయింది.

సభ్యత, సంస్కారం, తల్లి అంటే భయం అన్నీ అడ్డొచ్చి నోరు మూసుకుంది. కానీ మన సులో భావాలను ముందుగా కళ్ళే కదా వ్యక్తం చేసేది.

"ఏమిటీ! తినేసేలా చూస్తున్నావు. కాస్త ఆడ పిల్లలా ప్రవర్తించు" కసిరింది శ్రీవల్లి. కోపం అణుచుకుని తన గదిలో కెళ్ళిపోయింది.

◆ ◆ ◆

"అమ్మా!... నేను ఫేషియల్ చేయించుకుం టానే" గోముగా అడిగింది పావని శ్రీవల్లి ప్రక్కన కూర్చుని.

"చూడు పావనీ! అలాంటి వేషాలేం వద్దు! ఈమధ్య బ్యూటీపార్లర్‌లలో కూడా ఘోరాలు జరుగుతున్నాయని పేపర్లలో, టి.వి.ల్లో వార్తలోస్తున్నాయి చూశావుగా! సుబ్బరంగా సున్నిపిండి రాసుకుని స్నానం చెయ్యి చాలు. ఆ కాలేజీకి పంపించటమే నాకిష్టంలేదు. ఆడ పిల్లలకు చదువుండాలి కాబట్టి పంపిస్తున్నాను. రోజులు బాగాలేవు. ఏంటే అలా చూస్తావు? నేను నీ కన్నతల్లిని. సవతి తల్లిని కాదు" రుస రుసలాడింది శ్రీవల్లి.

"సుకన్య వాళ్ళమ్మ సవతి తల్లా?"

"ఏంటా ప్రశ్న?"

"ఆ అమ్మాయిని వాళ్ళు విచ్చలవిడిగా వదిలే శారు. మనమూ విచ్చలవిడిగా ఆహ్వానిస్తు న్నాము. అనుమానమొచ్చిందిలే" వెటకారం ధ్వనిస్తూ అంది పావని.

"ఆ అమ్మాయి అదృష్టవంతురాలు. కృష్ణ మంచివాడు. మనమూ మంచివాళ్ళం. మన వల్ల ఆ పిల్లకే హాని జరగదు. ఆ విషయం వాళ్ళ పెద్దవాళ్ళు గ్రహించారు."

"అయితే మనం తప్ప ఈ ప్రపంచంలో మంచివాళ్ళే లేరన్నమాట!"

"ఉన్నారు. ఉంటారు! కానీ మంచేదో... మంచివాళ్ళెవరో హాని చేసేవారెవరో గ్రహించే వయసు నీకు లేదు. కాబట్టి పెద్దవాళ్ళు చెప్పిన ట్టు నడుచుకుంటే బాగుపడతావు. లేకుంటే... ఇదిగో ఇలా పేపర్లలో, టీ.వి.ల్లో మోసపోయిన స్త్రీ జాబితాలో చేరతావు. నాకు కోపం తెప్పిం చకు" అంటూనే కోప్పడింది శ్రీవల్లి.

◆ ◆ ◆

"అమ్మా! నేను మా ఫ్రెండు ఇంటికి వెళ్ళొ స్తానే" అడిగింది పావని.

"ఎందుకు?... ఎందుకైనా సరే వెళ్ళక్కర్లేదు"

"అదేంటీ అలాగంటావు. ఆ అమ్మాయి దగ్గర నా పుస్తకముండిపోయింది తెచ్చు కుంటాను. పక్క వీధేగా!"

"ఏదో ఒక నెపం పెట్టుకుని వీధిలో ఊరేగా లని చూస్తావు. ఏం వెళ్ళక్కర్లేదు. రేపు కాలేజీలో ఇప్పించుకో. లేదా కిట్టుగాడొచ్చాక ఆ పిల్ల అడ్రసు చెప్పు తెస్తాడు." (ఇంకావుంది)








# నా(నే)టి సంక్రాంతి

కథ

సాయిశ్రీ

**వం**శీకి చాలా సంతోషంగా వుంది.

రెండురోజుల నుంచి అతని మనసంతా గాలిలో తేలిపోతున్నట్లుగా వుంది. అందుకు కారణం తాను సంక్రాంతి పండుగకి ఇండియా వెళ్ళబోతున్నాడు.

అతని మనస్సులో తన చిన్ననాటి స్మృతులు పదేపదే మెదులుతూ అతన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. ముఖ్యంగా అలకనంద- తన చిన్ననాటి స్నేహితురాలు. ఆమెకోసమే తని వ్యూదు వట్టుబట్టి ఇండియా వెళుతున్నాడు.

వంశీ చిన్నతనంలో అంటే తనకి తొమ్మిది పదేళ్ళ వయస్సు వచ్చేవరకూ పల్లెటూరిలో వాళ్ళ నాన్నమ్మ, తాతయ్యల దగ్గిరే పెరిగాడు. అక్కడ తనకు, తమ ఎదురింట్లో అలకనంద అనే ఓ చిన్న స్నేహితురాలు వుండేది. ఎప్పుడూ తన వెన్నంటే వుంటూ తనతోనే ఆడుకునేది. తాను కూడా అలకనందతోనే ఎక్కువగా ఆటలాడుతూ వుండేవాడు.

వంశీ వాళ్ళ అమ్మ, అలకనంద వాళ్ళమ్మ యిద్దరూ తెల్లవారు జామున వర్షంలా కురిసే మంచుని సైతం లెక్కచేయకుండా పోటీలు పడుతూ పెద్ద పెద్ద ముగ్గులు వేసి వాటినిండా రంగులు దిద్దేవారు.

అలకనంద తానుకూడా ముగ్గులు వేస్తానని మారం చేస్తుంటే, వాళ్ళమ్మ వద్దని, నీకు చేత కాదని చెపుతూ బతిమాలుతుండేది. అయినా అలకనంద వినిపించుకోకుండా మారాం చేస్తుండేది.

ఇదంతా గమనిస్తుండే వంశీ, అత్తయ్య బాధను చూడలేక 'నందూ! నీకు గొబ్బెమ్మలపై అలంకరించదానికి గుమ్మడిపూలు కోసిస్తాను, రా!' అంటూ అక్కడినుంచి బలవంతాన లాక్కొచ్చేసేవాడు.

వంశీకి సంక్రాంతి పండుగ అంటే చాలా యిష్టం. భోగి పండుగరోజు వేసే భోగిమంట అంటే అంతకన్నా యిష్టం. తమ యింట్లో పెంచుకునే ఆవులు, గేదెలు తిన్నంత తిని వదిలేసిన చెరుకాకు, వరిగడ్డి వంటి చెత్తని పారేయ కుండా పెద్ద కుప్పగా పోగుచేసి వుంచేవారు. ఆ కుప్పని భోగి పండుగరోజున భోగి మంటగా వేసేవారు. భోగిమంటకు చుట్టూ పెద్ద పెద్ద ఇత్తడి బిందెలతో నీళ్ళను కాచుకునేవారు. ఆ నీళ్ళు కాగగానే పెద్దవాళ్ళందరూ పిల్లలకు తలంటు స్నానాలు చేయించి కొత్త బట్టలు వేసేవారు.

అంతకు ముందురోజే వండిన అరిసెలు, జంతికలు చేతికిచ్చి బయటకు వెళ్ళి ఆడుకోమనేవారు, తమ పనులకు అడ్డురాకుండా.

ఇక వంశీ, అలకనంద కలిసి గాలిపటాలు ఎగురవేస్తూ మధ్యాహ్నం ఎప్పటికో గాని యింటికి చేరుకునేవారు కాదు.

సాయంత్రం అత్తయ్య ఆ వీధిలో అందర్నీ పేరంటానికి పిల్చి బొమ్మల కొలువు పెట్టి, అలకనందను కుర్చీలో కూర్చోపెట్టి భోగిపళ్ళు పోయించేది. పట్టులంగా, జాకెట్టు వేసుకుని, రెండు జడలకు జడకుప్పెలతో, జడలనిండా చేమంతి పూలు పెట్టుకుని ఎంత ముద్దొచ్చేదో అలకనంద. అది చూసి తనకు కూడా భోగి పళ్ళు పోయమని మారాం చేసేవాడు వంశీ.

'మగపిల్లలకు భోగిపళ్ళు పోయరు' అంటూ అందరూ నవ్వి తనను ఆటపట్టించేవాళ్ళు. అయినా సరే తను వినకుండా మరో కుర్చీ తెచ్చుకుని అలకనంద పక్కనే వేసుకుని కూర్చునేవాడు. తన బాధ పడలేక తన తలపై కూడా భోగిపళ్ళు పోసేవారు పేరంటాళ్ళు.

అదంతా గుర్తుచేసుకుంటూ గట్టిగా నవ్వేస్తున్న వంశీని పట్టుకుని గట్టిగా కుదుపుతూ "హేయ్ వంశీ! ఏమయింది నీకు?" అడిగాడు టామ్.

ఆ కుదుపుకి ఈ లోకంలోకి వచ్చిన వంశీ "టామ్! నేను ఇండియా వెళుతున్నాను" ఆనందంగా చెప్పాడు.

"ఇంత సడెన్‌గా ఇండియాకా? ఎందుకు?" ఆశ్చర్యంగా అడిగాడు టామ్.

పదిహేనేళ్ళ క్రితం వంశీ చిన్నతనంలోనే ఉద్యోగ నిమిత్తం అమెరికా వచ్చి అక్కడే స్థిర పడిపోయింది వంశీ వాళ్ళ కుటుంబం.

వంశీకి తమ పల్లెటూరి వాతావరణం, అక్కడ జరుపుకునే పండుగలంటే చాలా ఇష్టం. వచ్చిన క్రొత్తలోనే తమ యింటిప్రక్కనే వుండే



టామ్‌తో స్నేహం కుదిరింది. ఆ స్నేహం పుణ్యమా అని టామ్ వంశీ దగ్గర తెలుగు చాలా స్పష్టంగా మాట్లాడడం నేర్చుకున్నాడు.

కానీ అతను తెలుగు మాట్లాడుతున్న ప్రతి సారీ పిల్లిపిల్లో, కుక్కపిల్లో తుమ్ముతున్నట్లుగా అనిపించి నవ్వొస్తుంటుంది వంశీకి.

"మా నాన్నమ్మ సంక్రాంతి పండుగకి రమ్మని గోల చేస్తుంది. మేము అమెరికా వచ్చిన తర్వాత ఇప్పటి వరకూ అసలు ఇండియా వెళ్ళ లేదు కదా! అందుకని. మమ్మీ, డాడీలకి రావ దానికి కుదరదు. అందుకని నా పట్టుదలమీద నన్ను ఒక్కడినే ఇండియా పంపించడానికి నిర్ణ యించుకున్నారు. సంక్రాంతి పండుగ ఇండి యాలో చాలా బాగా చేస్తారు తెలుసా!" నంతో షాన్ని ఆపుకోడానికి ప్రయత్నం చేస్తూ చెప్పాడు వంశీ.

"ఇక్కడ కూడా మీరు ఎప్పుడూ చేస్తారు కదా! ఇండియాకే వెళ్ళాలా?" స్నేహితుడు కొన్నాళ్ళు దూరమవుతాడన్న దిగులుతో విచా రంగా అన్నాడు టామ్.

"ఇక్కడా!" అంటూ పడిపడి నవ్వాడు వంశీ.

"వై ఆర్ యూ లాఫింగ్ మేన్?" తనన్న మాటల్లో అంత నవ్వవలసిన అవసరం ఏముందనుకుని చిరాకు పడిపోయాడు టామ్.

టామ్‌కి కోపం వచ్చిందని అర్థం చేసుకున్న వంశీ నవ్వడం ఆపేసి- "ఇక్కడి సంక్రాంతి పండుగ కేవలం ఆ ఒక్కరోజు మాత్రమే మొక్కు బడిగా చేస్తారు. అదే ఇండియాలో అయితే, ముఖ్యంగా పల్లెటూళ్ళలో చూడాలి అసలు సంక్రాంతి పండుగ."

"ఎలా చేస్తారు?" ఆసక్తిగా అడిగాడు టామ్.

తన చిన్నతనంలో నాన్నమ్మ, తాతయ్యల దగ్గర వున్నప్పుడు అక్కడ జరుపుకున్న సంక్రాం తి పండుగ రోజుల్ని గుర్తు చేసుకుంటూ ఉత్సాహంగా చెప్పడం మొదలుపెట్టాడు వంశీ.

"సంక్రాంతి పండుగకు నెల ముందే రోజూ తెల్లవారుజామునే నిద్ర లేచి ఇంటిముందు వాకిట్లో చిక్కగా కలిపిన పేడ కళ్ళాపి చల్లి, పెద్ద పెద్ద ముగ్గులు పెడతారు. ఆ ముగ్గులలో రంగులు దిద్దుతారు. శీతాకాలంలో తెల్లవారు ఝామున వెన్నెలలో పావడా, వోణీలు వేసు కున్న ఆడపిల్లలు అలా ముగ్గులు పెడుతుంటే ప్రతి ఆడపిల్లా ఒక గోదాదేవిలా కనిపిస్తుంది. ఎప్పుడూ బలవంతాన నిద్ర లేపితే గాని ఏ ఎనిమిది గంట లకో నిద్ర లేవని మొగపిల్లలు ఈ సంక్రాంతి నెలరోజులు తమంతట తామే తెల్లవారు జాము నాలుగు గంటలకే నిద్రలేచి వూరిమీద పడతారు. ముగ్గులు వేస్తున్న తమ తమ స్నేహితురాళ్ళను చూసేందుకు. ఒకవైపు అందమైన రంగ వల్లులు దిద్దుతూనే, మరోవైపు ముగ్గులు చూసే వంకతో నెమ్మ దిగా నడిచి వెళ్ళే తమ హృద యేశ్వరులను ఓరకంటితో చూస్తూ ఆ రంగవల్లుల మధ్య గొబ్బెమ్మలు పెడుతున్న అమ్మా యిలు సాక్షాత్తూ ఆ గోపికల లాగే కనిపిస్తారు.

ఇలా ముప్పై రోజులు గడి చాక సంక్రాంతి పండుగ వస్తుంది. సంక్రాంతి ముందు



రోజు భోగి పండుగ. ఆ రోజు రాత్రి అసలు నిద్రే పోరు. అర్ధ రాత్రి వరకూ ఇంటిలోని వేస్టేజీ అంతా బయట వాకిట్లో పోగు చేసి వుంచుకుని తెల్లవారుఝామున రెండుమూడు గంటలనుండి భోగిమంట వేయడం ప్రారంభిస్తారు. ఆ రోజు ఇంటిలోని ఆవులకు, గేదెలకు కొమ్ములకు రంగులు వేసి, బంతిపూల మాలలు చుట్టి అలంకరిస్తారు."




వంశీ చెప్పినదంతా చాలా శ్రద్ధగా విన్న టామ్ "హూ ఈజ్ గోదం దేవి? వాట్స్ ద భోగం మాత?" పిల్లి తుమ్మినట్లుగా చాలా సీరియస్‌గా అడిగాడు.

గతస్మృతులను నెమరువేసుకుంటూ అప్పటి వరకూ ఉత్సాహంగా, అనర్గళంగా చెప్పుకు పోయిన వంశీ అదిరిపడి అమెరికన్ యాక్సెం ట్‌తో తెలుగుపదాలని భ్రష్టు పట్టించాడన్న కోపంతో టపీ టపీమని తల బాదుకున్నాడు.

"ఓరి నాయనో! నీ తెలుగు వింటే గోదాదేవి వెంటనే తన పేరు మార్చేసుకుంటుంది. భోగి మంట 'చచ్చినా నేను వెలగను గాక వెలగను' అని మొండికేస్తుంది. గోదం దేవి కాదురా, గోదాదేవి. భోగం మాత కాదు... భోగిమంట" సరిదిద్దాడు ఓపిగ్గా.

"ఓకే...ఓకే...!" అంటూ ఆగాడు టామ్.

"వంశీ! నీకు ఒక గోదం దేవి వుందా ఇండియాలో?" కొంటెగా అడిగాడు టామ్.

గోదం దేవి అన్నందుకు కోపం వచ్చినా అలకనందను గుర్తు చేసుకుంటూ సిగ్గుగా తలవూపాడు వంశీ.

"అయితే మనం వెంటనే ఇండియా వెళదాం. నాకు నీ గోదం దేవిని చూపించాలి" అంటూ ఉత్సాహంగా అరిచాడు టామ్.

✦✦✦

వంశీ, టామ్‌లు సాయంత్రం ఏడుగంటల సమయంలో ముంబైలో విమానం దిగి అక్కడి నుండి మళ్ళీ విమానంలో హైదరాబాద్ వచ్చి, అక్కడినుండి బస్సులో తమ వూరు చేరుకునే సరికి తెల్లవారుఝాము నాలుగు గంటలైంది.



తెల్లవారితే భోగి పండుగ.

పోటీలు పడుతూ భోగిమంటలు వేస్తున్న కుర్రకారుతో, కిలకిల నవ్వులతో రంగవల్లులు దిద్దుతున్న ఆడపిల్లలతో, హరిదాసుల కీర్తనలతో, డూ డూ బసవన్నల మెడలోని మువ్వల శబ్దాలతో వూరంతా ఎంతో సందడిగా వుంటుందని వూహించుకుంటూ టామ్‌తో ఉత్సాహంగా కబుర్లతో నడక సాగించాడు వంశీ.

కానీ ఎంతదూరం నడిచినా తన ఊహా చిత్రం కనులముందు సాక్షాత్కరించలేదు.

ఊరంతా చాలా నిశ్శబ్దంగా నిద్రపోతోంది.

నాలుగు వీధులు నడిచాక ఎదురైన దృశ్యం చూసి నోరెళ్ళబెట్టాడు వంశీ.

ఆ వీధిలో నలుగురైదురు ఆడపిల్లలు ఎవరి ఇంటిముందు వాళ్ళు ఒంటికాయ శొంఠి కొమ్ముల్లా ఎవరి లోకంలో వాళ్ళున్నట్టుగా ప్రక్కవారితో తమకేం సంబంధం కానీ, అవసరం కానీ లేదు, రాదు అన్నట్టుగా ఎవరి వాకిళ్ళలో వాళ్ళు ఒంటరిగా ముగ్గులేస్తున్నారు. అది కూడా ఏ విధంగానంటే...

నైటీలు వేసుకుని ఇద్దరు ముగ్గురు చాక్ పీసలతో ముగ్గులు వేస్తుంటే, ఒకమ్మాయి మాత్రం నాలుగాకులు ఎక్కువే చదివాను అనుకుందేమో! త్రీ బై ఫోర్ లెగ్గింగ్, టీ షర్ట్ వేసుకుని చెవుల్లో ఇయర్ ఫోన్స్ పెట్టుకుని పిచ్చి దానిలా తల వూపుకుంటూ, మధ్య మధ్యలో ముగ్గు వేయడం ఆపి చేతిలోని చాక్‌పీస్‌ని క్రింద పడేసి చేతులు, నడుమూ వూపుతూ,

తప్పొచ్చిన ముగ్గుని కాలితో చెరుపుతూ రక రకాల విన్యాసాలతో ఆమె చేతిలో రూపు దిద్దుకుంటోన్న ముగ్గు విలవిలలాడిపోయేలా ఆ ముగ్గుని చిత్రహింస పెడుతోంది.

అప్పటికే తనవైపు అదోలా చూస్తున్న టామ్ చూపుల్ని తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ నెమ్మదిగా ముందుకు నడిచాడు వంశీ.

నాలుగు ఇళ్ళు దాటిన తరువాత ఒక ఇంటిముందు అతికించి వున్న ప్లాస్టిక్ స్టిక్కర్ల ముగ్గులను చూసి విరక్తిగా నవ్వుకున్నాడు.

'ఏరీ తన స్నేహితులు? ఎక్కడ తను ఊహిం చిన పల్లెటూరి అందాలు, సంక్రాంతి సంబ రాలు? ఏమైపోయారు గోదాదేవి, గోపికలు? ఎంతో ఊరించి ఊరించి తన స్నేహితుడిని అమెరికా నుంచి తీసుకువచ్చాడు తమ వూరి అందాలు, సంప్రదాయాలు చూపించాలని. కానీ ఇక్కడ ఎదురయిందేమిటి? ఆ సంబ రాలన్నీ ఇక ఎండమావులేనా? కొంపదీసి తన అలకనందకూడా ఇలాగే కనిపిస్తుందా?'

ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతున్న వంశీ తలవంచుకుని నిశ్శబ్దంగా, భారంగా ముందుకు అడుగులు వేయసాగాడు.

"హేయ్ వంశీ! గోదం దేవి, భోగం మాత" ఉత్సాహంగా అరిచిన టామ్ అరుపులకి చివ్వున తలెత్తి చూసిన వంశీకి టామ్ మాటలు తెలుగుని భ్రష్టు పట్టించినట్లుగానో, పిల్లి తుమ్మి నట్లుగానో కాక కోయిల గానంలా వీనుల విందుగా వినిపించాయి.

అల్లంత దూరంలో ఉవ్వెత్తున ఎగిసి పడు తున్న భోగిమంట, ఆ ప్రక్కనే యింటి ముందు పేడకళ్ళాపి చల్లిన పచ్చని వాకిట్లో... తల స్నానం చేసి తడిజుట్టుకు తువ్వాలు చుట్టుకొని, కంచిపట్టు లంగా, వోణీ వేసుకుని, అలవోకగా కూర్చుని, అందంగా తీర్చిదిద్దిన రంగు రంగుల రంగవల్లుల మధ్యలో గొబ్బెమ్మలు పెడుతూ వాటిని గుమ్మడి పువ్వులతో అలంకరిస్తోంది ఒక యువతి. ఆమె ఎవరో కాదు...తన చిన్న నాటి స్నేహితురాలు... అలకనంద.

పల్లెటూళ్ళలో సంబరంగా జరుపుకునే సంక్రాంతి పట్నపు వాసనలతో ఒక అందమైన అనుభూతిని మంచుతెరలా కనుమరుగై పోవడం నిజంగా మన పాపమే!

అక్కడక్కడ కనిపించే 'అలకానంద'లకు నా ఈ కథ అంకితం!

# టూత్‌పేస్ట్

## -కోనె నాగవెంకట ఆంజనేయులు



మా ఆవిడ రాసిచ్చిన లిస్ట్ ప్రకారం ఆ నెలకు కావలసిన రేషన్ సామన్లన్నీ తీసుకొచ్చాను.

టూత్‌పేస్టులు మా నాన్నకో బ్రాండు. మాకో బ్రాండు, మా పిల్లలకో బ్రాండూ తెస్తుంటాను నెల నెలా.

సామాన్లలోంచి మా నాన్నకి ఓ టూత్‌పేస్టు తీసిచ్చాను.

"ఇదేంటి ఈ పేస్ట్ తెచ్చావు?" అడిగాడు మా నాన్న సీరియస్‌గా.

ఆయన ఎప్పుడూ వాడే బ్రాండ్ కాదు అది. ఆ బ్రాండ్ దొరక్కపోవడంతో ఏదైతేనేంలే అని మేము వాడే రకమే ఆయనకీ తెచ్చాను.

"మీరెప్పుడూ వాడే బ్రాండ్ దొరకలేదు నాన్నా! అయినా మీ పళ్ళకి ఏ టూత్‌పేస్టయితే ఏంటి?" అన్నాను.

"ఏ టూత్‌పేస్ట్ పడితే ఆ టూత్‌పేస్ట్ వాడితే నా పళ్ళేమవుతాయనుకున్నావు? నా బ్రాండ్ పేస్టు నాక్కావలసిందే" నిక్కచ్చిగా చెప్పాడు మా నాన్న.

"అదికాదు నాన్నా! ఆ షాపులో మా బ్రాండ్ టూత్‌పేస్ట్ లేదు. ఈ నెలకి దీన్తో సరిపెట్టుకోండి. వచ్చేనెల మీ బ్రాండ్ తప్పకుండా తెస్తాను" అర్థిస్తున్నట్లుగా అన్నాను.

"కుదరదంటే కుదరదు. నేనెప్పుడూ వాడే టూత్‌పేస్ట్ తీసుకు వచ్చేవరకూ పళ్ళు తోమితే ఒట్టు" అంటూ తన రూంలోకి వెళ్ళిపోయాడు మా నాన్న.

చచ్చినట్లు మళ్ళీ స్కూటర్ మీద నాలుగు కిలోమీటర్లు అవతలున్న సూపర్‌మార్కెట్‌కి వెళ్ళి మా నాన్న బ్రాండ్ టూత్‌పేస్ట్ కొనితెచ్చి ఆయనకిచ్చాను.

"ఇప్పుడెలా దొరికింది?" అంటూ ఆనందంగా అందుకున్నాడా టూత్‌పేస్ట్ మా నాన్న.

ఆ మరునాడు ఉదయం-

నూతి చప్టా దగ్గర చతికిలబడి బ్రష్ మీద తన బ్రాండ్ టూత్‌పేస్టు పెట్టి తన కట్టుడుపళ్ళ సెట్‌ని శుభ్రంగా తోముకుంటున్న బోసినోటి మానాన్నని చూసి పళ్ళు పటపటా కొరుక్కున్నాను.

హాస్యానందం పాఠకులకు సుపరిచితులు, హాస్యానందం శ్రేయోభిలాషులు
**శ్రీ కోనె నాగవెంకట ఆంజనేయులుగారు.**
వీరు విశాఖపట్టణం స్టీల్‌ప్లాంట్‌లో పర్సనల్ డిపార్ట్‌మెంట్ మేనేజర్‌గా పనిచేసి
డిశంబర్ 31న ఉద్యోగ విరమణ చేశారు.
విరమణానంతరం మంచి మంచి వ్యాపకాలతో వీరు సుఖసంతోషాలతో,
ఆయురారోగ్యాలతో ఆనందంగా కాలం గడపాలనీ
హాస్యానందం మనసారా కోరుకుంటోంది!

# పబ్లిక్ టాక్!




**భోళాశంకరుని వరం, భరణివారి 'మిథునం'**

మిథునం వంటి మంచి చిత్రాలు మౌత్ టాక్ వలనే సక్సెస్ సాధిస్తాయి. కాని ఆ టాక్ ప్రజల్లోకి వెళ్ళేలోపల థియేటర్లలో ఆ చిత్రం ప్రదర్శింపబడుతుంటేనే, జనాలు ఆ చిత్రాన్ని నిలబెట్టగలరు.

దేవుడికి, భక్తునికి మధ్య పూజారి అడ్డు అన్నట్టు కాకుండా మంచిచిత్రాలకు, ప్రేక్షకులకు మధ్య డిస్ట్రిబ్యూటర్/ఎగ్జిబ్యూటర్ వారధిగా నిలబడితేనే 'మిథునం' వంటి మంచి చిత్రాలు విజయం సాధించగలదు.

కేవలం బిజినెస్ దృష్టిలో పెట్టుకునే డిస్ట్రిబ్యూటర్స్ ఎగ్జిబిటర్స్ మారనంతవరకు మంచి చిత్రాలను ఆదరించడంలేదని ప్రజలను నిందించడం భావ్యం కాదు.

'మిథునం' చిత్రం చూస్తున్నంతసేపు భరణి గారి తపస్సు కనిపించింది. అదే విధంగా ఈ చిత్రం జనాల్లోకి తీసుకువెళ్ళటానికి చిత్రం థియేటర్లలో నిలిపి వుంచేలా ఇంకా తపస్సు చేసివుంటే బాగుండేది.

ఈ చిత్రం గురించి ఒక్క ముక్కలో చెప్పాలంటే శ్రీ రమణగారు రాసిన కావ్యాన్ని దృశ్య కావ్యంగా మలచడంలో తనికెళ్ళ భరణిగారు ఆ భోళానాథుని ఆశీర్వాదం పొందగలిగారు.

కథ విషయానికి వస్తే అప్పదాసు (బాలసుబ్రహ్మణ్యం, బుచ్చిలక్ష్మి (లక్ష్మి) దంపతులు. పిల్లలు విదేశాలలో స్థిరపడి వుంటారు. పిల్లలు వారిని తమ వద్దకు రమ్మని అన్నా, పుట్టిన వూరు, ప్రశాంత జీవనం వదిలి వెళ్ళటానికి ఇష్టపడరు. పచ్చని ప్రకృతి మధ్యలో ఒకచిన్న ఇల్లు, గ్రైండర్, ఫ్రిజ్ వంటి ఏ ఆధునిక వసతులు, మొబైల్, టి.వి. వంటి న్యూసెన్స్ వస్తువులు వాడకుండా స్వచ్ఛమైన జీవనం సాగిస్తుంటారు. వారికి కాలక్షేపం ఒకరి తోడు ఒకరు. వారికి తోడు లేగదూడ, రేడియో. అరవై సంవత్సరాలు దాటిన ఈ నవదంపతుల ప్రేమ... అలక... ఆనందం... బాధలతో కథనం సాగుతుంది.

వయస్సు పెరిగిన కొద్దీ భార్య, భర్తలు ఒకరిపై ఒకరికి ఎక్కువ అవసరం, అనుబంధం పెరుగుతాయనే నిజాన్ని భరణిగారు చాలా చక్కగా తెరకెక్కించారు. చిత్రం ఆద్యంతం కేవలం రెండు పాత్రలతో ఏమాత్రం విసుగు కలిగించకుండా చక్కని అనుభూతి పంచే విధంగా తీర్చిదిద్దిన భరణిగారి ప్రతిభ అభినందనీయం.

తెలుగు సంవత్సరాది ఉగాది రోజులా ఒక తియ్యని జ్ఞాపకంగా ఈ చిత్రం ప్రేక్షకుల హృదయాలలో నిలిచిపోతుంది.

కల్లాకపటం లేని వ్యక్తిగా, భోజన ప్రియుడుగా, చిన్నపిల్లల మనస్తత్వం కలిగిన విధంగా అప్పదాసు పాత్రలో బాలు నటన, తను తోడుగా లేకపోతే క్షణమైనా బ్రతకలేరని నిత్యం భర్తకు తోడుగా వుండే భార్య పాత్రలో లక్ష్మి నటనల గురించి చెప్పటానికి సాహసం చాలదు. సింపుల్‌గా జీవించారు అని రాయడానికి మనసు అంగీకరించదు. వారి నట జీవితంలో వెనక్కి తిరిగి చూసుకుంటే ▶



**మిథునం గురించి బాపుగారు...**

బుచ్చిలక్ష్మి గారు అన్నట్టు,
బంగారం హరించుకుపోయి లక్క ముద్దగా
మిగిలిపోయిన నాకు –
నలుగురు పరిపూర్ణమైన (తెలుగులో
పెర్‌ఫెక్ట్) మనుషులు – రమణ, భరణి
బాలు, లక్ష్మి రూపొందించిన – అద్భుతమైన
అసామాన్యమైన, అనుపమానమైన సినిమా కావ్యం
'మిథునం'లో ఒకటే లోటు కనిపించింది –
నాతో బాటు రమణగారు చూడలేకపోయారే
అని — బాపు 30.12.12




## చెత్త స్క్రీన్‌ప్లేతో 'సారొచ్చారు'

**పా**త్రలకు సరిపడా నటీనటులు లేకపోతే మంచి చిత్రమైనా ప్రేక్షక ఆదరణ వుండదని తెలియజేసిన చిత్రం ఇది.

రవితేజకున్న ఇమేజ్‌కు సరిపోని చిత్రమిది.

కథ ప్రకారం రవితేజ పాత్ర మలచివున్నా మరో 'ఆటోగ్రాఫ్' చిత్రంలా ఒక క్లాస్ చిత్రంగానైనా మిగిలి వుండేది. రవితేజకున్న మాస్, యూత్ ఇమేజ్‌కు న్యాయం చెయ్యాలనే భావనతో స్క్రీన్‌ప్లే మలచడంతో ఈ చిత్రం ఇటు ఫ్యామిలీ మూవీ కాలేదు... అటు క్లాస్ మూవీ కాలేకపోయింది.

పెళ్ళికిముందు వుండేది ఇష్టం. పెళ్ళయ్యాక ప్రేమ వుంటుంది. ప్రేమతో పాటు అర్థం చేసుకునే మనస్తత్వం వుంటేనే ఆ కాపురాలు కలకాలం నిలుస్తాయి. అనే పాయింట్‌తో వచ్చిన చిత్రం 'సారొచ్చారు'.

కథ విషయానికి వస్తే కార్తీక్ (రవితేజ) అకాడమీ స్కూల్‌లో ఫిజికల్ డైరెక్టర్‌గా చేస్తుంటాడు. కార్తీక్‌ను చూసిన మొదటి క్షణమే సంధ్య (కాజల్) ప్రేమలో పడుతుంది. అతనితో జర్నీ చేస్తూ ఆ విషయం చెప్పాలని అతని చుట్టూ తిరిగి చాలా ఫీట్ చేస్తుంది. కాని కార్తీక్ తనకు ఆల్‌రెడీ ఆశ (రిచా గంగోపాధ్యాయ)తో పెళ్ళయిందని చెపుతాడు.

ప్రేమించి, పెళ్ళి చేసుకుంటారు కార్తీక్, ఆశ. పెళ్ళికి ముందులా టైం స్పెండ్ చెయ్యడం లేదని ఆశ, కార్తీక్‌తో ఎప్పుడు గొడవ పడుతూనే వుంటుంది. పెళ్ళికి ముందు ప్రియురాళ్ళి సొంతం చేసుకోవడానికి టైం అంతా స్పెండ్ చేస్తారు కాని, పెళ్ళయ్యాక బాధ్యతలు పెరుగుతాయి. పెళ్ళాం పిల్లలకు సెక్యూరిటీ ఇవ్వాలనే తాపత్రయంతో పెళ్ళానికి ఎక్కువ సమయం కేటాయించలేరని కార్తీక్ చెప్పినా ఆమె వినదు. బోర్డు మీటింగ్‌లో వుండి కార్తీక్, ఆశను అనుకున్న సమయానికి బయటకు తీసుకెళ్ళలేకపోతాడు. దాంతో ఆమె కార్తీక్‌ను వదిలి పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఇప్పుడు విడాకుల కోసమే ఇండియా వెళ్తున్నాను అని కార్తీక్, సంధ్యతో ఫ్లాష్‌బ్యాక్ చెపుతాడు.

దాంతో తను ప్రేమించిన వ్యక్తికి ఆల్‌రెడీ పెళ్ళయిందని తెలిసి సంధ్య అప్‌సెట్ అవుతుంది. కాని సెకండ్ హ్యాండ్ వ్యక్తి పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడదు. సంధ్యను ఆమె బావ గౌతమ్ 20 సంవత్సరాలుగా మూగగా ప్రేమిస్తుంటాడు. సంధ్యను గౌతమ్‌కిచ్చి పెళ్ళి చెయ్యడానికి సంధ్య తల్లి ఇష్టపడుతుంది.

కార్తీక్, సంధ్యను డైరెక్టుగా ఇంటికి తీసుకువెళ్ళి, తన తల్లితండ్రులకు మీ కోడలు అని సంధ్యను పరిచయం చేస్తాడు. సంధ్య ఆశ్చర్యపోతుంది. తనకు పెళ్ళి కాలేదని, తన ఫ్రెండ్ జీవితంలో జరిగిన సంఘటనలు ఫ్లాష్‌బ్యాక్‌లో చెప్పానని కార్తీక్ అంటాడు. కార్తీక్ తనతో అబద్ధం చెప్పి మోసం చేశాడనే భావనతో సంధ్య, గౌతమ్‌తో పెళ్ళికి సిద్ధపడుతుంది. కాని సంధ్య మనసులో కార్తీక్ వున్నాడని, తన ప్రేమని త్యాగం చేసి గౌతమ్, కార్తీక్‌తో సంధ్య వివాహం జరిపిస్తాడు.

ప్రేమ, పెళ్ళిమీద ఎన్ని చిత్రాలు వచ్చినా, ఆడియన్స్ ఫీల్ అయితే ఆ చిత్రాలన్నీ సక్సెస్ సాధించి తీరుతుంది. కాని ఈ చిత్రంలో హీరో ఫ్రెండ్ ఫ్లాష్‌బ్యాక్‌ను తన ఫ్లాష్‌బ్యాక్‌గా చూపించి, సడన్‌గా ఆ ఫ్లాష్‌బ్యాక్ తన ఫ్రెండ్‌ది అని చెప్పడంతో ఆడియన్స్ జీర్ణించుకోలేకపోయారు. స్క్రీన్‌ప్లే చెత్తగా వుంది. సంధ్య వయస్సు 20 సంవత్సరాలు అయివుంటే గౌతమ్ సంధ్యను 20 సంవత్సరాలుగా ఆమెకు తెలియకుండా ప్రేమించడం ఏమిటో అర్థం కాదు. పైగా ఇద్దరు కలిసినపుడు సంధ్య నన్ను గుర్తుపట్టిందని గౌతమ్ పొంగిపోతాడు.

రవితేజ ఇమేజ్‌కు తగ్గకూడదని అటు లవర్‌గా ఇటు మ్యారీడ్‌గా చూపించడానికి ముక్కలు ముక్కలుగా, (అనేక కట్‌షాట్స్) ఫ్లాష్‌బ్యాక్ చూపించి ఫీల్ లేకుండా చేశారు.

దేవిశ్రీప్రసాద్ మ్యూజిక్ ఫరవాలేదు. చంద్రమోహన్, జయసుధ, పరుచూరి వెంకటేశ్వరరావు వంటి నటీనటులు ఒకటి, రెండు సీన్లలోనే కనిపిస్తారు. సంధ్యగా కాజల్ నటన చాలా బాగుంది. రిచా, రవితేజల సీన్లు వెంటవెంటనే కట్ అయిపోతుండడంతో వారి ఎమోషన్స్ తెలియకుండా పోతుంది.

'అలా మొదలైంది' చిత్రంతో సక్సెస్ సాధించిన డైరెక్టర్‌గా ద్వితీయవిఘ్నం తప్పలేదు.

జల్సా చిత్రంలో ఒక డైలాగ్ వుంటుంది. ఆడదాన్ని చుట్టూ మగవాడు తిరిగితే అది రొమాన్సు. మగవాడి చుట్టూ ఆడది తిరిగితే అది న్యూసెన్సు. ఈ చిత్రం కూడా అంతే.

**చంద్రశేఖర త్యాడి**

⇨ 'ది బెస్ట్'గా నిలిచే చిత్రమని కచ్చితంగా చెప్పగలము.

తెలుగు మహాసభలో ప్రదర్శించే చిత్రాన్ని నిలిపిన భరణిగారికి అభినందనలు.

విశ్వరూపం విడుదలకు ముందే ప్రేక్షకుల వద్దకే నా సినిమాను తీసుకువెళతానని సాటిలైట్ రైట్స్ ఇచ్చి మొదటిరోజే థియేటర్లతో పాటు ఇళ్ళల్లో ప్రదర్శింపచేస్తున్న కమల్‌హాసన్ సాహసం, భరణిగారు ఇకనైనా చేస్తే బాగుంటుంది. సాటిలైట్ ద్వారా ఆంధ్రదేశమంతా ఒక మంచి చిత్రాన్ని తొందర్లో చూసే భాగ్యం కలుగుతుంది.

పసుపులేటి సుధారాణి

# లాఫింగ్ జర్నీ



## వీరభక్తి

చార్‌ధామ్ యాత్రకు బయలుదేరిన ప్రయాణీకులందరమూ ఢిల్లీలో బస్సు ఎక్కాము.

బస్సుని ముఖ్యమనుకున్న ప్రదేశాలలో వున్న దేవాలయాల దగ్గర ఆపుతూ మమ్మల్ని అందరినీ ఆ దేవాలయాల లోపలికి వెళ్ళి దర్శనం చేసుకుని రమ్మని చెపుతున్నారు సుబ్రహ్మణ్యం అంకుల్‌గారు.

అలాగే మేమందరం వెళ్లి క్యూలో నిలబడి దర్శనం చేసుకుని వస్తున్నాము. అలా గుడికి వెళ్ళిన ప్రతిచోటా నాకొక చికాకు ఎదురవసాగింది. అదేమిటంటే, మా తోటి ప్రయాణీకులలో సన్నని గొంతుతో చెవులు చిల్లులు పడేలా మాట్లాడే అంటీ ఒకరు వున్నారు.



ఆ అంటీ ఏ గుడికి వెళ్ళినా నా వెనక నుంచోవడం, సరిగ్గా దేవుడిని దర్శనం చేసుకునే సమయానికి నా చున్నీనో, భుజాలో పట్టుకుని గభాలున గుంజినట్టు వెనక్కి లాగేసి తను ముందుకు వెళ్ళి గబగబా చేతులు జోడించేసి ఏవేవో చదివేసుకుని... టపటపా చెంపలు వాయించేసుకోవడం జరుగుతోంది.

ఆమె తోటిభక్తులని వెనక్కి లాగివడేస్తున్నందుకు వాయించుకుంటుందో, లేక భక్తిలో ఒక భాగంగా వాయించుకుంటుందో నాకైతే అర్థంకాలేదు. ఏది ఏమైనా పెద్దావిడ కదా! పోనీలే అని నాకు నేను సర్దిచెప్పుకున్నాను.

మధ్యదారిలో ఒక దేవాలయం దగ్గర అందరూ అక్కడ వున్న వస్తువులను కొంటున్నారు. అక్కడ 'ఓక్' వృక్షాల కాయలు కూడా గుత్తులు గుత్తులుగా కోసుకొచ్చి అమ్ముతున్నారు. అవి ఇంటికి దిష్టిగా కట్టుకుంటే మంచిదంటూ ఏవేవో చెపుతున్నారు.

మా తోటి ప్రయాణీకులలో ఇంచుమించు అందరూ నాలుగైదు గుత్తులు కొనేసి బస్సులో సీట్లకు పైన లగేజ్ పెట్టేచోట జాగ్రత్తగా పెట్టుకున్నారు.

ఆ రోజు బస్సు ఎక్కడ ఆగినా ఆ ఓక్‌చెట్టు కాయలు మాత్రం ఎక్కడా అమ్మటం కనిపించలేదు.



కేదారనాథ్ వెళ్ళిన తర్వాత దర్శనం చేసుకునేందుకు అందరమూ ఆలయానికి వెళ్ళి, గర్భాలయం ద్వారం పక్కన ముందుగా దేవి అక్క, లక్ష్మీ మేడమ్, అర్జున్ సార్, తర్వాత నేను, నా తర్వాత మిగిలిన వాళ్ళందరూ నిల్చున్నాము.

కాసేపటికి నా చెయ్యి పట్టుకుని పక్కకు లాగెయ్యడం మొదలుపెట్టింది సన్నగొంతు ఆంటీ. నాకు చెప్పలేనంత కోపం వచ్చింది. అయినా పోనీలే అని పక్కకు తప్పుకున్నాను.

నేను వూరుకున్నా అర్జున్ సార్ వూరుకోలేదు.

"ఏయ్ చిన్నీ! ఎక్కడికి వెనక్కి వెనక్కి వెళ్ళిపోతున్నావు. పిల్లలు తల్లిదండ్రుల దగ్గరే వుండాలి" అని కోపంగా చూస్తూ, నా చెయ్యి పట్టుకుని లాగి మేడమ్‌గారి ప్రక్కన నిలబెట్టి, సార్ నా పక్కన నించున్నారు.

అదిచూసి మా మేడమ్ కళ్ళతోనే వారిస్తూ సన్నగొంతు అంటీ వాళ్ళ ఫ్యామిలీని ముందుకు వెళ్ళమని వెనక్కి జరిగారు.

ఆమె ఆనందంగా గబగబా ముందుకు వెళ్ళిపోయారు. గర్భగుడిలోకి వెళ్ళిన తర్వాత చూస్తే, కేదారనాథుని జ్యోతిర్లింగానికి తాకేందుకు చేతులు చాపినా అందనంత దూరంలో వున్నారు సన్నగొంతు అంటీ వాళ్ళు.

మేము మాత్రం కొంచెం ముందుకు వెళ్ళి కేదారనాథుని జ్యోతిర్లింగానికి అతి ముఖ్యమైన వెన్ను భాగంవైపు చాలా దగ్గరగా కూర్చుని, మా శిరస్సులు తాకించి మరీ అభిషేకాదులు చేయించుకుని తృప్తిగా బయటకు వచ్చాము. అది చూసి సన్నగొంతు అంటీ ముఖం మాడిపోయింది.

బస్సు ప్రయాణం మొదలైన తర్వాత కొండ చరియల దగ్గర మలుపులు తిరుగుతున్న ప్రతిసారీ అంటీ కూర్చున్న సీటుకి పైన లగేజ్ పెట్టేచోట పెట్టిన 'ఓక్' కాయలు టపీ టపీమని వరసగా అంటీ నెత్తిమీద పడటం మొదలు పెట్టాయి. అలా పడిన ప్రతిసారీ వాటి స్వంత దారులు వచ్చి మళ్ళీ అక్కడే సర్దడం, కాసేపటికి అవి మళ్ళీ ఆమెమీద పడటం...

మొదటిసారి పడినప్పుడు తేలిగ్గా తీసుకుని నవ్వేసింది.... రెండవసారి బలవంతంగా నవ్వింది.... మూడవసారి ఏడవలేని నవ్వు నవ్వింది.

నాలుగోసారి మాత్రం ఇక సహించ లేకపోయింది సన్నగొంతు అంటీ.

"నా నెత్తిమీదే పడాలా ఇవి? తీసెయ్యండి ఇక్కడినుండి" అంటూ గట్టిగా అరిచేసింది.

"వీరభక్తులకి కేదారనాథస్వామి అప్పుడప్పుడు ఇలాగే పరీక్షలు పెడుతుంటాడట అంటీ" సన్నగొంతు అంటీ బాధితులలో ఎవరో కాని స్వరంలో అతివినయం ఉట్టిపడుతుండగా, ఓదార్పుగా అన్నారు.

అంతే! అప్పటికే అందరూ వినోదంగా నవ్వుతున్నారేమో, ఆ మాటలకు తెల్లగా వుండే సన్నగొంతు అంటీ నల్లగా మారిపోయింది.

# సంక్రాంతి సందడి


ఏవండీ.. నేనెంతో కష్టపడి ముగ్గులు వేసిన దాన్ని..
కబ్జా చేసేసింది..!


ఆ ఇంటావిడ చలిలో బాధపడుతూ ముగ్గులు వేయకుండా...


నేను..నీ ముగ్గులకి రంగులు పెడితే..స్టార్టర్‌గా తీసుకుని... ఇంకా జోరుగా వేయాలి గాని.. నాతో ఈ పని చేయించడం.. బాలేదు..


ఏం జనరేషన్ టెక్నాలజీయో ఏంటో, ముగ్గులు ఎలా వేయాలో ఏ సైట్‌లోనూ దొరకడం లేదు... రాజ్...!


ముగ్గులు వేయడం నా చెల్లెలికి తెల్సు దానికి మీరేం నేర్పించాలక్కర్లా...


నీకు ముగ్గులు వేయడం రాదు..ఆంటీ!

# కార్టూనస్త్రాలు

## ఏ ఎండకా గొడుగు!

మీరు మాత్రం మార్నేను అన్నారుగా! అందుకే తులసి దగ్గర కొవ్వొత్తి పెట్టా!

సుధ...

## మోడ్రన్ జనరేషన్




## ఇక ఇంతే!



## నేటి పతివ్రత!

కాళ్ళు నొప్పులతో చచ్చాను. అంతలా నీళ్ళలో పడేస్తారా సార్!

పాపం! పూజాయామి రోజుకు 3,4 సార్లు నా భర్త పాద పూజ చేస్తుందిలే!

## ప్రజా సేవకులు




## మారిపోయాయి!





కథ

# సీన్‌లేని సింగినాదం

శ్రేష్టి శేషగిరి

'ఏ బ్యాడ్ న్యూస్ ఫర్ ది సొసైటీ ఈజ్ సెడ్ టు బీ గుడ్ న్యూస్ ఫర్ ది రిపోర్టర్.' అన్నది ఏ మహానుభావుడోకాని... ఆ సామెత మన సింగినాదంకు బాగా వర్తిస్తుంది.

ఎక్కడ ఏ వార్త దొరుకుతుందా అని అందరి కంటే తానే ముందుగా పనిగట్టి తమ ఛానల్‌కి పంపి మంచిపేరు కొట్టేయాలా అని నిత్యం ఆత్రంగా ఎదురుచూస్తుంటాడు సింగినాదం.

ఒకవేళ ఏదైనా వార్త దొరికిందంటే చాలు వెనకా ముందూ చూడకుండా అక్కడికి వెళ్ళి వాలిపోతాడు.... తన సంధాన వాహనంతో సహా.

ఈ మధ్య ఒక మంచివార్తకూడా తేవడం లేదని అతని బాస్ అతన్ని నానా తిట్లు తిట్ట సాగాడు.

ఆ తిట్లు విన్నాక అతను వెంటనే మూసీ నదిలో దూకి చావాలనుకున్నాడు. ఆ వాసనకు వాంతొచ్చినట్టై వెంటనే ఆ ప్రయత్నాన్ని విర మించుకుని వార్తల వేటలో పడ్డాడు.

'ఈ రోజు ఏదైనా మంచి వార్త దొరకాలి, అది చూసి మా బాస్ నన్ను వేనోళ్ళ మెచ్చు కోవాలి...' అని ప్రతిరోజూ వెయ్యిదేవుళ్ళకు మొక్కుకునేవాడు.

ఆ రోజు అనుకోకుండా అతని కోరికని తీర్చాలనుకున్నాడు దేవుడు.

వెంటనే అతని సెల్ రింగవ్వడంతో వెర్రికేక పెట్టి ఆ సెల్‌ని ఆన్ చేశాడు.

"హలో! దిసీజ్ సింగినాదం ఫ్రం 9999 టీవి. ఎనీథింగ్ ఇంపార్టెంట్?" అని అడిగాడు తెగ ఆత్రుతగా.

"హలో సార్! నా పేరు సుడిగాలి.... నేను ఇక్కడ మీకో గొప్ప న్యూస్ ఇవ్వాలని కాల్ చేశాను.... మీరు వెంటనే ఫలానా చోటికి రావాలి." అని ఫోన్ పెట్టేశాడు.

అతను ఫోన్ పెట్టడమాలస్యం వెంటనే రెక్క లు గట్టుకుని వెళ్ళి అక్కడ వాలిపోయాడు.

అక్కడో పెద్దగుంపు కనబడుతుంది. దాన్ని చూడగానే అతనికి కళ్ళు ఆనందంతో విప్పా రాయి.

'అహ! ఈ రోజు నా పంట పండింది. ఇక్కడ ఇంత జనం పోగయ్యారంటే ఇక్కడేదో జరగరాని ఘోరమేదో జరిగుంటుంది కచ్చి తంగా ఈ విషయాన్ని వెంటనే మా ఛానల్‌లో లైవ్‌లో చూపించాలి. అనుకుంటూ వెంటనే తమ చానల్ వాళ్ళకి పెట్టా బేడా వేసుకురమ్మని కబురంపాడు సింగినాదం.

అవతల స్టూడియోలోనుండి ఓ యువతి మేకప్ సర్దుకుని సింగినాదానికి ఫోన్ చేసింది.

"హలో సుబ్బలక్ష్మీ! నేను సింగినాదాన్ని.." అన్నాడు ఆత్రుతగా సింగినాదం.

"ఏరా ఎన్నిసార్లు చెప్పాలిరా నీకు. నన్ను సుబ్బలక్ష్మి అని పిలవవద్దని... నీకసలు బుద్ధుందా?" అని విరుచుకుపడింది సులాక్షి అలియాస్ సుబ్బలక్ష్మి.

"అబ్బా! ఆ సంగతి ఇప్పుడనవసరం. ఇక్కడో హాట్‌న్యూస్ దొరికింది. వెంటనే మన టి.వి.లో స్క్రోలింగ్‌లో వెయ్యి." అన్నాడు కంగారుగా సింగినాదం.

"అవునా? ఏంటా హాట్‌న్యూస్" అని అడి గింది కళ్ళింత చేసుకుని.

"ఇక్కడ జరుగుతున్నది " అన్నాడు ఏమ నాలో తెలీక సింగినాదం.

"ఏం జరుగుతుందక్కడ?"

"అది నాకేం తెలుసు? నేనూ ఇప్పుడే వచ్చాను. అన్ని ఛానల్స్‌కంటే ముందుగా" అన్నాడు గర్వంగా.

"ఏడ్చి మొహం కడిగినట్లుంది. నీది హాట్ న్యూసా? పైపెచ్చు నువ్వే అందరికంటే ముందే వచ్చావా? ఒక్కసారి నీ తలతిప్పి చుట్టూ చూడు సింగినాదం" అంది సుబ్బలక్ష్మి సీరియస్‌గా.

"ఎందుకు?... నాకున్న ఫాన్ ఫాలోయింగ్ ఎంతో చూద్దానికా?" అన్నాడు తల సరిచేసు కుంటూ.

"నీకంత లేదుకానీ...నువ్వు ముందు ఎక్స్ ట్రాలాపి నేను చెప్పింది చెయ్యి..." అంది



సుబ్బలక్ష్మి.

సింగినాదం తాపీగా తలతిప్పి చూశాడు.

అతను వెంటనే షాకైయ్యాడు.

అతని చుట్టుపక్కల దాదాపు అన్ని ఛానల్స్ వారు గంటనుండి అక్కడ జరుగుతున్న దాన్ని వీరలెవెల్లో చిత్రీకరిస్తున్నారు.

అప్పుడుగానీ అర్థం కాలేదు సింగినాదానికి తాను ఈ పోటీ ప్రపంచంలో ఎంతగా వెనక వున్నాడు అని.

ప్రతిసారీ లేట్‌గా స్పాట్‌కి వెళ్ళడం బాస్‌తో నానా చీవాట్లు తినడం అలవాటైపోయాయి సింగినాదానికి.

ఈ సారి బాస్ వెయ్యబోయే రంకెలు గుర్తొచ్చి గుండెపోటు వచ్చినంత పనైంది సింగినాదానికి.

అతను అలా అనుకున్నాడో లేదో వెంటనే బాస్‌నుండి కాల్ వచ్చింది పిడుగులా.

ఫోన్ తియ్యడం ఆలస్యం తిట్లదండకం అందుకున్నాడు బాస్.

దాదాపు రెండు చెవుల్లోంచి రక్తం కారేంతవరకూ చెడా మడదా తిట్టి పోశాడు సింగినాదాన్ని.

ఈ అవమానాన్ని భరించలేక, సహించ లేక ఏ బస్సుకిందైనా పడి చావాలను కున్నాడు సింగినాదం బాధగా.

అతను అలా అనుకున్నదే తడవుగా ఒక స్కూలు బస్సు వేగంగా అతని ముందునించి దూసుకుపోతూ కనిపించింది.

ఆ బస్సులో పిల్లలు హాహా కారాలు చేస్తు న్నారు పెద్దగా.

ఆ సీన్ చూడగానే సింగినాదం మెదడు పాదరసంలా కదిలింది.

వెంటనే ఇది కచ్చితంగా ఎవరో కిడ్నాపర్స్ పనే. అని అనుకుని తన డొక్కుబండిని నాలుగు కిక్కులు కొట్టి స్టార్ట్ చేసి ఆ బస్సుని ఫాలో అయ్యాడు.

ఆ స్కూలు బస్సు మరింత వేగంగా వెళ్ళడంతో సింగినాదంలో అనుమానం మరింతగా బలపడింది. ఎవరో పెద్ద కిడ్నాపర్లముఠా ఏకంగా బస్సుతో పాటే పిల్లలందరినీ కిడ్నాప్ చెయ్యాలని పెద్ద ప్లాన్ చేస్తున్నారు ఆ గుట్టుని రట్టు చేయాలి ఎలాగైనా అనుకొని వెంటనే తన సెల్ తీసి స్టూడియోకి ఫోన్ కొట్టాడు.

"సుబ్బలక్ష్మీ... వెంటనే హాట్‌న్యూస్‌ని ఓ పాతికసార్లు స్క్రోలింగ్ వెయ్యి. నేనిక్కడ ఓ గొప్ప అడ్వెంచర్‌ని టెలికాస్ట్ వెయ్యబోతు న్నాను. దీంతో నాకూ, మన ఛానల్‌కీ మంచి పేరు ప్రఖ్యాతలొచ్చేస్తాయి.... మన ఛానల్ నెంబర్‌వన్ అవుతుంది...." అని ఇంకేదో అంటుండగా.

"ఏహే, చాల్లే ఆపు నీ పగటికలలు. ఇంతకీ ఏంటి అక్కడ విషయం అని కసురుకుంది సుబ్బలక్ష్మి స్టూడియోలో చిరాగ్గా.

ఇది అలాంటిలాంటి న్యూస్ కాదు. ఇది నిజంగా సెన్సేషనల్ న్యూసే. దీనితో బాస్ నన్ను తెగ మెచ్చుకుంటాడు చూడు" అన్నాడు సింగినాదం ఆనందంగా.

"హల్లో సింగా! నీకంత లేదుగానీ ముందు విషయమేంటో చెప్పు. హాట్‌న్యూసా కాదా నేను చెప్తాను" అంది తాపీగా సుబ్బలక్ష్మి.

"ఇదిగో సుబ్బు! ఇలా ప్రతిసారి నువ్వు నా పనితనాన్ని తక్కువగా అంచనా వెయ్యడం ఏం బాగోలేదు" అన్నాడు చిన్నబుచ్చుకుంటూ సింగినాదం.




"ఆ, సర్లే కానీ ఇంతకు విషయం చెప్పి తగలడు."

"చెప్తానుగానీ నువ్వు వెంటనే హాట్‌న్యూస్ అని స్క్రోలింగ్ వెయ్యి" అన్నాడు ఆతృతగా.

"అలాగేనయ్యా బాబా" అనుకుంటూ హాట్‌న్యూస్ అని హడావిడిగా వేసేసింది.

ఇంతకు ఏంటో ఆ హాట్‌న్యూస్ త్వరగా చెప్పి తగలడు. అవతల బాస్ నన్ను చంపుతు న్నాడు" అంది సులాక్షి టెన్షన్‌గా.

"పట్టపగలు నడిరోడ్డుమీద జరుగుతున్న




ఘోరం" అంటూ మొదలెట్టాడు సింగినాదం వీర లెవెల్లో.

"హల్లో సింగూ! సోది వద్దు కానీ సూటిగా విషయానికి రా చాలు" అంది సీరియస్‌గా.

"స్కూలుపిల్లలని బస్సుతో కిడ్నాప్ చేయాలని ప్లానింగ్" అన్నాడు.

"ఏంటీ స్కూలు పిల్లలనా? అదీ బస్సుతో పాటేనా?" అంది సీరియస్‌గా సులాక్షి.

"ఆఁ!... అవును సులాక్షి! నువ్వు విన్నది నిజమే. ఇక్కడ ఎవరో కిడ్నాపర్స్ అమాయక పిల్లలని ఏకంగా బస్సుతోపాటే కిడ్నాపింగ్ చేస్తున్నారు" అన్నాడు ఉత్సాహంగా.

"ఎవరూ... ఎవరు చేస్తున్నారు ఈ పని. ఎవరా కిడ్నాపర్స్" అంటూ తనదైన శైలిలో ప్రశ్నల వర్షం కురిపించింది యాంకరమ్మ. ఇదేదో నిజంగా గొప్పవార్త కాబోతుందని మనసులో అనుకుంటూ.

"ఆ సుబ్బూ!... ఇక్కడ జూబ్లీ హిల్స్ దగ్గర ఈ సంఘటన చోటుచేసుకుంది. గత అర గంట నుండి నేను ఆ స్కూల్‌బస్‌ని ఫాలో అవుతున్నాను. ఆ బస్సుని ఆపడానికి విశ్వ ప్రయత్నం చేశాను. అయినా ఆ డ్రైవర్ ఆపడం లేదు. పైపెచ్చు ఆపే ప్రయత్నం చేస్తున్నందుకు నన్ను బండబూతులు తిట్టాడు" అంటూ గల గలా చెప్పుకుపోతున్నాడు సింగినాదం.

"ఆ! సింగు! ఆ స్కూలుబస్సులో ఎంతమంది పిల్లలున్నారు?'

"ఆఁ... సుబ్బు! దాదాపు పాతికమంది వున్నట్లున్నారు."

"వారిలో ఎవరైనా భయంతో ఏడుస్తున్నారా? అరచి గోల చేస్తున్నారా?"

"అబ్బే అటువంటిదేమీ లేదు సుబ్బు. అందరూ కామ్‌గా వున్నారు. బహుశా వారికి ఏ మత్తుమందో వేసివుంటారు సుబ్బు" అని అనుమానాన్ని వెలిబుచ్చాడు.

"అది ఏ రకమైన మత్తుమందు అయి వుంటుంది సింగినాదం" అనడిగింది సుబ్బు ఆత్రంగా.

"కాసేపు బస్సాపితే డ్రైవర్‌ని అడిగి చెప్తాను. లేకపోతే నాకేం తెలుసు. అదేం మత్తుమందో నీ తిక్కప్రశ్నలు నువ్వు" అని కసురుకున్నాడు సింగినాదం.

"ఆ సింగు! ఇప్పుడేం జరుగుతుందక్కడ? ఆ బస్సులో పిల్లలంతా క్షేమంగా వున్నారంటావా? లేక పోయారంటావా?" అడిగింది సుబ్బు పళ్ళన్నీ ఇకిలించి.

"శుభం పలకవే మంగమ్మా అంటే ఏదో అన్నదట. వెనకటికి నీలాంటిది ఎవరో. ఆ పిల్లలని ఎలా కాపాడాలని నేను ఆలోచిస్తుంటే నీ పైత్యం ఏంటి మహాతల్లి" అని కసురుకున్నాడు సింగినాదం.

ఈ లోగా ఖాళీగా వుండడం ఎందుకు అని సుబ్బు స్టూడియోలో నానా హైరానాగా భయంకరమైన మ్యూజిక్‌తో ఇది మా చానల్‌కే ప్రత్యేకంగా అని నాలుగైదుసార్లు వాయించివేసింది.

అవతల సింగినాదం ఆ బస్సుని యమా స్పీడుగా ఛేజింగ్ చేస్తున్నాడు.

ఆ లోపు ఈ విషయం తెలిసి మరో పదిమంది ఛానల్స్‌వారు కూడా అతనికి పోటీగా పెట్టేబేడా వేసుకుని పరుగెత్తుకు వచ్చారు.

ఇక్కడ స్టూడియోలో సుబ్బలక్ష్మి సింగినాదాన్ని సెల్ పదే పదే కాల్ చేస్తున్నా అతను లిఫ్ట్ చేయటంలేదు.

దాంతో ఆమెలో కంగారు ఎక్కువైంది.

కాసేపటికి కాల్ లిఫ్ట్ చేసిన సింగినాదాన్ని "ఏమైంది సింగూ! ఎంతకీ కాల్ తియ్యలేదు. ఏమైనా అర్జంటా?" అనడిగింది.

"ఆఁ... అటువంటిదే... నాకు ఒకటి అర్జంటే. అందుకే ముందాపని కానిచ్చుకుని వచ్చా."

"ఆఁ... ఇప్పుడు విషయానికొస్తావా?" అంది సుబ్బు చిరాగ్గా.

అతను వెంటనే బస్సుని యమాస్పీడుగా ఛేజింగ్ చేయడం మొదలెట్టాడు.

అతని వెంటే మరో వందమంది వివిధ ఛానల్స్ వారుకూడా రేసింగ్ చేస్తున్నారు.

చూసేవారికదో బైక్‌రేసింగ్ పోటీలాగుంది తప్ప బస్సు ఛేజింగ్‌లా లేదు.

బస్సుని ఛేజింగ్ చేస్తూ చేస్తూ సింగినాదం దాన్ని మొత్తానికి ఎలాగోలా అడ్డుపడి ఆపేశాడు.

బస్సు డ్రైవర్ అతన్ని నానా తిట్లు తిట్టి నాలుగు తన్నబోయాడు. అందుకు కారణం స్కూల్లో జరిగిన ఫేర్‌వెల్ ఫంక్షన్‌లో ఫుడ్ పాయిజన్ అయింది. అక్కడ కేక్ తిన్న పిల్లలమీద ప్రభావం చూపింది. వెంటనే పిల్లలని ఆసుపత్రికి తరలిస్తున్నాడు డ్రైవర్.

అతను చేసే మంచిపనిని మెచ్చుకోవాల్సింది పోయి అతన్ని ఆపేందుకు ప్రయత్నించినందుకు విరుచుకుపడ్డాడు అతని మీద డ్రైవర్ వీరలెవెల్లో.

ఆ విషయం తెలీక ఏదో సెన్సేషన్ న్యూసనుకుని బస్సుని ఫాలో అయిన సింగినాదాన్ని చెడామడా చీవాట్లు పెట్టి ఓ చీటీ చేతిలోపెట్టి పంపించాడు అతని బాస్. ఒక బస్సువల్ల తన బతుకు బస్టాండౌతుందని కలలో కూడా ఊహించలేదు సింగినాదం.

# ముగ్గుల ముచ్చట్లు

రాగతి పండరి

వాగ్దేవి


















అవును మరి. ప్రతిరోజూ ఏదోక కలహమేనాయె! ప్రతిరాత్రీ నిరర్థకంగా గడిచి పోవడమేనాయె! కొత్తగా పెళ్ళయిన ఓ మగాడికి, అందునా అప్సరసలాంటి భార్య వున్న ఓ మగాడికి అంతకన్నా నరకం ఏముంటుంది?

బోలెడంత డబ్బు! కోరిన తిండి తినే అవకాశం! నచ్చిన బట్ట కట్టుకునే వీలు. నచ్చిన వాహనంలో ఎక్కడికంటే అక్కడికి వెళ్లి వచ్చే ఛాన్స్! అన్నీ ఉన్నాయ్... కానీ, ఏం లాభం?

అల్లుడి నోట్లో శని సామెతలాగా!

ఎంత ప్రయత్నించినా రుద్రమతో సఖ్యంగా వుండలేకపోతున్నాడు చిట్టిబాబు.

ఉండగలగటానికి ఆమె మనసు తిన్నగా వుంటేగా?!

ఎప్పుడూ ఏదో ఒకటి అనుకుంటూనే వుంటుంది మనసులో. పోనీ పట్టించు కోకుండా వుందామా అంటే చెవిలో బూరపెట్టి ఊదుతున్నట్లు అన్నీ స్పష్టంగా తెలిసిపోతుంటే ఎలా వుండగలుగుతాడు?... వాటిని తను పట్టించుకోకుండా వుండటం అసాధ్యం.

అసలు ఇదంతా ఆ దివ్యశక్తి వల్లే వచ్చింది. సడన్‌గా తనలోంచి ఆ శక్తి తొలగిపోతే ఎంత బాగుంటుంది?

రుద్రమతో కలహాలు ఒక్కటే కాదు, ఆ శక్తివల్ల 'నా' అనుకున్న మనుషులందరి పట్లకూడా ఏదోక సందర్భంలో విరక్తి కలుగుతూనే వుంది తనకి!

> **జరిగిన కథ:** బస్టాప్‌లో బస్ కోసం ఎదురు చూస్తుండగా ఒక అందమైన అమ్మాయి చిట్టిబాబుని చూసి నవ్వుతుంది. ఆమె ఎందుకు నవ్వుతుందో అర్థం కాక ఎదుటి వాళ్ళు మనసులో అనుకున్నది తెలిస్తే ఎంతబాగుంటుందో అనుకుంటాడు. అలా అనుకోగానే ఎదుటివాళ్ళు అనుకుంటున్నవన్నీ చిట్టిబాబుకి తెలిసి పోతుంటాయి. బస్టాప్‌లో కనిపించిన అమ్మాయితో చిట్టిబాబు పెళ్ళి జరుగుతుంది. అయితే మొదటిరాత్రి ఆ అమ్మాయి మనసులో అనుకుంటుం దంతా తెలిసి చాలా బాధపడ్డాడు చిట్టిబాబు. అలా భార్య మనసులో తన గురించి అనుకున్నవి తెలుసుకుని చాలా బాధపడ్డాడు చిట్టిబాబు. -ఇకచదవండి

ఈ పద్ధతి ఇలాగే కొనసాగితే కొన్నాళ్ళకి ఏ ఒక్కరినీ నమ్మలేని పరిస్థితి ఏర్పడుతుంది తనకి. ఏ ఒక్కర్నీ మనస్ఫూర్తిగా ప్రేమించలేక పోతున్నప్పుడు ఇంకెందుకీ జీవితం?

'అమ్మ, అక్క, చెల్లి, తమ్ముడు... వీళ్ళందరినీ కూడా ఎంతో గాఢంగా ప్రేమించేవాడు తను.

అలాంటిదిపుడు వారి మనసులు తెలిసి పోతుండటం వల్ల ఏ ఒక్కరినీ సరిగ్గా ప్రేమించ లేకపోతున్నాడు తను. చివరికి అమ్మను కూడా!

అంతెందుకూ ఎంతో మనసుపడి చేసుకున్న భార్యతోనే సఖ్యంగా వుండలేకపోతున్నాడు తను. ఎందువల్ల? కేవలం తనలో ఆ శక్తి వుండబట్టేగా?

ఎలాగూ ఇప్పుడు కావల్సినంత డబ్బు సమ కూడిపోయింది. కాబట్టి, ఇపుడు తనలోంచి ఆ శక్తి తొలగిపోయినా మరేం ఫర్లేదు.

'నిజంగా అలా జరిగితే ఎంత బాగుణ్ణు!" ఇదే వాక్యాన్ని ఓ అరడజను సార్లను కున్నాడతను.

కానీ, ఏం లాభం?

అది అసురసంధ్యవేళ కాకపోవటాన్న పై నుండి 'తథాస్తు' అనలేదెవ్వరూ.

అతనింకా అలాగే అనుకుంటూ వుండగా "ఏం చేస్తున్నారిక్కడ?" అంటూ అప్పుడే అక్కడి కొచ్చింది రుద్రమ.

"ఏదో ఆలోచిస్తున్నాను?" అన్నాడు చిట్టి బాబు ముక్తసరిగా.

సఖ్యత వున్నా లేకపోయినా భార్య భార్యే కదా!అంత తేలిగ్గా అతన్ని వదిలి వెళుతుందా?

"దేన్నిగురించి ఆలోచిస్తుంటా?" అతనికి ఎదురుగా ఓ స్టూల్‌మీద సెటిలైపోయి నిగ్గ తీస్తూ అడిగింది రుద్రమ.

"ఏంలేదు!" అన్నాడు అడ్డంగా తలాడిస్తూ చిట్టిబాబు.

"గంటనుండి గమనిస్తున్నాను మిమ్మల్ని. బుర్ర బద్దలయ్యేలా ఏదో ఆలోచిస్తూ కూడా ఏం లేదంటారేంటి? అయినా ఇప్పుడు మీరేగా చెప్పారు ఏదో ఆలోచిస్తున్నానని..." జిడ్డులా పట్టుకుంది రుద్రమ.

క్రితంరాత్రి తామిద్దరిమధ్యా జరిగిన గొడవొ కటి గుర్తుకొచ్చి, "ఏంలేదు. నువ్వెళ్ళి నీ పని చూసుకో!" అనేశాడు చిట్టిబాబు కోపంగా.

"నాకిపుడు పనేంలేదు. ఖాళీగానే వున్నాను.

చెప్పండి?... ఏంటాలోచిస్తున్నారు?" అంది రుద్రమ మొండిగా.

క్రితంరాత్రి గొడవ మళ్ళీ మనసులో మెద లగా, మళ్ళీ మండిపోయింది చిట్టిబాబుకి.

"ఏం లేదన్నాగా! నా చావేదో నన్ను చావనీ. నువ్ పో... ఇక్కడ్నుంచి..." అని గసిరేశాడు.

'ఛీ! బొత్తిగా సంస్కారం లేని మనిషి!... ఎద్దులా ఎలా రంకెలేస్తున్నాడో చూడు!' అను కుంది రుద్రమ కోపంగా.

"ఏంటీ? నేను సంస్కారం లేని మనిషినా? ఎద్దులా రంకెలు వేస్తున్నానా?" ఆవేశంతో ఊగిపోయాడు చిట్టిబాబు.

"దీన్ని ఎద్దులా రంకెలు వేయడమనే అంటా రైండి..." అంది రుద్రమ చేతులు తిప్పుతూ.

"షటప్!" కోపంతో పళ్ళు నూరాడు చిట్టి బాబు.

"వై షుడ్ ఐ?" నాకూ వచ్చు పళ్ళు నూరడ మన్నట్టు తనూ పళ్ళు నూరింది రుద్రమ.

"ఏంటి పళ్ళాదేలా కొరుకుతున్నావ్?"

"ఏం? మీరుమాత్రం నూరడం లేదా?"

"నేనూరితే నువ్వూ నూరాలనుందా?"

"అంటే ఏంటి?... పళ్ళు నూరే హక్కు మీ మగాళ్ళకి మాత్రమే వుందనుకుంటున్నారా?"

అలా వాళ్ళిద్దరూ మాటామాటా అనుకుం టుంటే "ఎందుకురా కీచులాడుకుంటు న్నారు?" వచ్చింది తాయారమ్మ.

"ఏం లేదమ్మా!" అనేశాడు చిట్టిబాబు.

"ఏం లేదులే అత్తయ్యా!" అనేసింది రుద్రమ కూడా.

"ఏం లేకపోవడం ఏంటీ? మీ పెళ్ళయిన ప్పటినుంచి నేను గమనిస్తున్నాను. ఒకర్నొకరు ఇష్టపడి చేసుకున్న వాళ్ళయ్యుండి ఏనాడూ మీరిద్దరు సఖ్యంగా ఉండటం చూడలేదు నేను. చెప్పండి? అసలేంటి మీ మధ్య గొడవలు?" అంటూ తనూ మరో స్టూల్ మీద సెటిలైంది తాయారమ్మ.

"ఏం లేదులేమ్మా..." అనబోయి అంతలోనే మనసు మార్చుకున్నాడు చిట్టిబాబు.

రాన్రాను పరిస్థితి విషమించిపోతోంది. ఇలాంటప్పుడు అమ్మకి విషయమంతా చెప్పే సి, ఏదైనా సలహా అడిగితేనే మంచిదనిపించి "మా మధ్య గొడవలు రావటానికి కారణం నాలోని దివ్యశక్తేనమ్మా!" అని ప్రారంభించి ఆ మీదట విషయమంతా వివరంగా చెప్పు కొచ్చాడు చిట్టిబాబు.

"విన్నారుగా అత్తయ్యా! నేను మనసులో అనుకునే ప్రతి చిన్నమాటనీ పట్టించుకుని ఆయనే రోజూ లేనిపోని రాద్ధాంతం చేస్తు న్నారు" అంది రుద్రమ చటుక్కున. సమయం దొరికింది కదాని!

ఆమె ఫిర్యాదు చేస్తున్న ధోరణిలో అలా



అంటుంటే ఒళ్ళు మండిపోయింది చిట్టిబాబుకి.

"నీ తప్పేం లేదన్నట్టు మాట్లాడతావేం?" అన్నాడు కోపంగా రుద్రమవైపు క్రోధంగా చూశాడు.

'కొత్తగా పెళ్ళయిన వాళ్ళెంత అన్యోన్యంగా వుండాలి! ఓ అయిదారేళ్ళు గడిచిపోయాక అయితే ఎవరైనాసరే తన్నుకు చస్తారు. కీచులాడుకు చస్తారు. అది వేరే విషయం. సహజం కూడా. కానీ, ఇప్పటినుంచే వీళ్ళిలా తయారయ్యారంటే వ్యవహారం చాలా అధ్వాన్నంగా వుందన్నమాట!

దీన్ని గనక నివారించకపోతే ముందు ముందు వీళ్ళింకేం సుఖపడి ఛస్తారు? కొట్టుకు చావటానికే వున్నటైం సరిపోతోంది.' బాధగా అలా అనుకుని–

"తప్పు ఎవరిదన్నది ప్రశ్న కాదు!... దీనికి పరిష్కారమేమిటో ఆలోచించడండి ముందు." అంది తాయారమ్మ ఎటో ఆలోచిస్తూ.

'ఈ మహానుభావుడితో జీవితాంతం ఇలా వేగుతూ వుండాల్సిందే...' అని మనసులో అనుకుని "ఏముందత్తయ్యా! దీనికి పరిష్కారం ఏమీ లేదు..." అంటూ చేతులు తిప్పింది రుద్రమ.

ఆమె పైకి అన్నమాటల్ని కాకుండా మనసులో అన్నమాటల్నే పట్టించుకుంటూ–

"నాతో అంతగా వేగలేకపోతుంటే పోనీ... విడాకులిచ్చేసెయ్" అన్నాడు చిట్టిబాబు ఆవేశంగా.

"పెళ్ళయి నిండా నెలయినా కాలేదు. అప్పుడే విడాకులేంట్రా వెర్రివెధవా? అయినా తనిపుడేం నీతో వేగలేకపోతున్నానని అనలేదుగా! ఎందుకలా లేనిపోనివి ఊహించుకుంటావ్?" కోడలినే సపోర్ట్ చేస్తూ మాట్లాడింది తాయారమ్మ.

"నేనేం లేనిపోనివి ఊహించుకోవటం లేదు. ఈ మహానుభావుడితో జీవితాంతం వేగుతూ వుండాల్సిందేనా? అని ఈవిడగారు మనసులో అనుకుంటేనూ అన్నాన్నేను...." భార్యకేసి మరింత క్రోధంగా చూస్తూ అన్నాడు చిట్టిబాబు.

చిట్టిబాబు పండిట్ చిట్టిబాబుగా మారిపోయాక అతనిలో అలాంటి అద్భుతశక్తి వుందని అందరికీ తెలిసిపోయింది కాబట్టి, దాని మనసులోని మాట నీకు ఎలా తెలిసిందని తాయారమ్మ ఏం ఆశ్చర్యపోలేదు.

"ఏమ్మా అనుకున్నావా నీ మనసులో?" అని అడిగింది కోడల్ని.

బొంకడం దేనికిలెమ్మని "అవునత్తయ్యా! అనుకున్నాను. ఏం తప్పా?" అని ఎదురుప్రశ్న వేసింది రుద్రమ.

భార్యాభర్తలన్నాక మనసులో ఒకరినొకరు తిట్టుకోకుండా ఎలా వుండగలుగుతారు?

అందుకే 'నీదే తప్పు!' అని అనేందుకు నోరు రాలేదు తాయారమ్మకు.

"తప్పేం లేదుగానీ... నీ భర్తలో అలాంటి దివ్యశక్తి వుంది కాబట్టి నువ్ నీ మనసుని కాస్త కంట్రోల్ చేసుకోవాలమ్మా!" అంది హితవు చెబుతూ.

ఈ మాట భర్తనోటినుండి అనేకసార్లు విని ఉన్నదే నామె! అందుకే దాన్నేం పట్టించుకోలేదు రుద్రమ్మ.

"నీకేంటి తల్లీ! చెప్పడం తేలికే! ప్రతిక్షణం మనసును కంట్రోల్ చేసుకోవటం ఎలా సాధ్యమవుతోంది? భలే గొప్పకొడుకుని కన్నావ్‌లే!"






అనుకుంది మనసులో.

అది గ్రహించి రెచ్చిపోయాడు చిట్టిబాబు.

"మధ్యలో మా అమ్మననుకుంటావేం? నీకు కోపం వుంటే నన్ను అను! అంతే తప్పమా అమ్మగురించి చెడ్డగా అనుకుంటే నేను సహించను" అన్నాడు గబుక్కున పైకి లేచి, చెయ్యి పైకెత్తుతూ!

ఆ చేతిని ఒడిసిపట్టుకుంటూ "నా గురించి చెడ్డగా అనుకుందా? ఏమనుకుందిరా?" అని కుతూహలంగా అడిగింది తాయారమ్మ.

"భలే గొప్ప కొడుకుని కన్నావ్‌లే! అని తను అనుకుంటూ వుంది..." పళ్ళు నూరుతూ చెప్పాడు చిట్టిబాబు.

"నిజమా?' అన్నట్టు కోపంగా చూసింది తాయారమ్మ కోడలికేసి.

"నేనేం అలా అనుకోలేదు." పప్పులు ఉడక వని తెలిసినా కూడా బుకాయించింది రుద్రమ.

"లేదు... నువ్వలా అనుకున్నావ్. నాకు స్పష్టంగా వినిపించింది..." పళ్ళు నూరడాన్ని ద్విగుణీకృతం చేస్తూ అన్నాడు చిట్టిబాబు.

"అవుననుకున్నాను. ఇపుడేమిటి?" అంటూ తిరగబడింది రుద్రమ.

"చూశావామ్మా! చూశావా? అత్తగారన్న మర్యాద లేకుండా అలా అనుకున్నది చాలక... పైగా ఎలా మాట్లాడుతోందో చూశావా?" ఆవేశ పడిపోయాడు చిట్టిబాబు.

ఆవేశం అన్నివేళలా అనర్థదాయకమేనన్న సూక్తి అతనికి ఆ సమయంలో గుర్తుకురాలేదు.







"ఎంతయినా నీకిది తగదు రుద్రమా!..." అని ఇంకా ఏదో అనబోయింది రుద్రమవైపు కోపంగా చూస్తూ తాయారమ్మ.

"ఏంటి నాకు తగనిది?" అంటూ మళ్ళీ ఇందాకటి ధోరణిలోనే విరుచుకుపడింది రుద్రమ.

"చూశావా చూశావా... ఎంత పొగరో!" పదే పదే నూరితే అరిగిపోతాయని కాబోలు ఈసారి పళ్ళు నూరకుండా గుర్రుగా చూస్తూ అన్నాడు చిట్టిబాబు.

"ఏంటి పొగరు?... ఎవరికి పొగరు?..." అంటూ మరింత రెచ్చిపోయింది రుద్రమ.

ఎంతయినా తాయారమ్మ ఇపుడు అత్తగారు కదా! కోడలలా రెచ్చిపోతుంటే సహించలేక పోయిందామె.

"ఆడపిల్లన్నాక కాస్త అణకువ వుండాల మ్మా! ఏంటి మరీ అలా రెచ్చిపోతున్నావ్? కాస్త తగ్గు!" అంది కోపంగా.

"నేనేం అణకువ లేనిదాన్ని కాను" అంది రుద్రమ మూతి తిప్పుతూ.

"ఇలా మాటకు మాట బదులివ్వటాన్ని అణుకువ అనరు..." ఉరిమి చూశాడు చిట్టిబాబు.

"అంటే ఏంటి మీ ఉద్దేశ్యం? క్షణక్షణం నా మనసును చదివేస్తూ మీరు నానా రాద్ధాంతం చేస్తుంటే నేను చచ్చినట్టు నోరు మెదపకుండా పడుండాలా?" తనూ ఉరిమిచూసింది రుద్రమ.

(సశేషం)

అప్పుడలా....! ఇప్పుడిలా...!! రాంమోహన్









విశ్వనాథం సతీసమేతంగా ఒక లారీ లోడుతో బాంకు కాలనీలో దిగాడు.

ఈ మధ్యే అతనికి కాకినాడనుండి ట్రాన్స్‌ఫర్ అయ్యింది. రాగానే మొదట బ్యాంకులో పరిచయం అయిన వాడు కిరణ్.

ఆ పూట విశ్వనాథం కుటుంబాన్ని టిఫిన్‌కు ఆహ్వానించాడు కిరణ్.

విశ్వనాథం మాటకారి. తెరిచిన నోరు తెరిచే వుంటుంది.

తన సర్వీస్‌లో ఎన్నెన్ని వూళ్ళు తిరిగాడో, ఎన్ని యాతనలు పడ్డాడో సింగిల్ ఎపిసోడ్‌లో చెప్తుంటే అతని భార్య అరుణ మాత్రం ముభావంగానే వుండిపోయింది.

చూస్తుంటే ఆమె ఎవ్వరితోనూ కల్సిపోయే రకంలా లేదు.

బ్యాంకు వ్యవహారాలగురించి కిరణ్, విశ్వనాథం మాట్లాడుకుంటూ వుంటే ఈలోపు కిరణ్ భార్య జీడిపప్పు వేసిన వేడి వేడి ఉప్మా తెచ్చి వాళ్ళ ముందుంచింది.

ఒక స్పూను నోట్లోకి పోనిచ్చిన విశ్వనాథం కళ్ళల్లో అనిర్వచనీయమైన మెరుపు కన్పించింది.

టీవీలో వంటల ప్రోగ్రామ్‌లో యాంకర్‌లా "ఆహా, అద్భుతం, అనన్యసామాన్యం. ఇంత రుచి నా జన్మలో ఎప్పుడూ చూడలేదు. అసలు వంటింట్లో నుండి ఘుమఘుమలు నా నాసికా పుటాలు తాకి మీ ఆవిడ వంట ఏ స్థాయిలో వుంటుందో ముందే గ్రహించేశాను" అన్నాడు ఇంకో స్పూనుడు లోపలికి పోనిస్తూ.

"అంతగా పొగడాల్సిందేమీ లేదులెండి అన్నయ్య గారూ! నాలుగు జీడిపప్పులు ఎక్కువ పడ్డాయి అంతే. పైగా మీరు దూరప్రయాణం చేసి వచ్చి వుంటారు. ఆకలివల్ల ఎక్కువ రుచి అన్పించి వుంటుంది" అంది కిరణ్ భార్య రజని చిన్నగా నవ్వుతూ.

ఈలోపు మరో విడత ఉప్మా అతని ప్లేటులో వడ్డించింది రజని.

"చెల్లాయ్! నాకు మొహమాటం అంటూ లేదు. అందుకే చాలామందిలా ప్లేటు వెనక్కి లాక్కోలేదు. ఏమీ అనుకోవుగా" అంటూ చప్పుళ్ళు చేసుకుంటూ ప్లేటు ఖాళీచేస్తూ చివరకు ఉప్మా 'అదుర్స్' అంటూ ఒక కాంప్లిమెంట్ పారేశాడు వాష్‌బేసిన్ దగ్గర మూతి కడుక్కుంటూ.

"అరుణా! రజనీగార్ని అడిగి రుచిగా ఉప్మా చెయ్యడంలో మెళకువలేవో తెల్సుకో..."

అన్నాడు భార్యవైపు చూస్తూ విశ్వనాథం.

అప్పటికే అరుణమొహం అరుణవర్ణం దాల్చింది. మొగుడు ప్రతి ఇంట్లో అవతలి వాళ్ళను పొగిడి తన పబ్బం గడుపుకోవటమే కాకుండా వాళ్ళదగ్గరే తనని ఎద్దేవా చెయ్యటం ఆమెకు తలకొట్టేసినట్లుగా వుంటోంది.

"బాగుందండీ అన్నయ్యగారూ! ఆమెనలా ఎందుకు తక్కువ చేసి మాట్లాడతారూ? వెధవ ఉప్మా చెయ్యలేనివాళ్ళు కూడా ఈ ప్రపంచంలో వుంటారా చోద్యం కాకపోతే?" అంటూ నవ్వేసింది రజిని.

"సర్లెండి మేము స్థిరపడ్డాక ఒకసారి మా ఇంటికి రండి. మీకే తెలుస్తుంది ఆవిడగారి పాకశాస్త్ర ప్రావీణ్యం. అన్నట్టు ఒకసారి ఏమయ్యిందంటే వినాయక చవితికి మా ఆవిడ చేసిన ఉండ్రాళ్ళు బ్యాంకులో నా కొలీగ్స్ ఇద్దరికి రుచి చూపించే సాహసం చేశాను. ఇక చూస్కోండి వాళ్ళ మొహాలు. ఉండ్రాళ్ళంతా ఇసుక, రాళ్ళమయం. బియ్యం ఆడించేటప్పుడు రాళ్ళూ గట్రా చూసుకోలేదుట. ఇక వారంరోజులపాటు వాళ్ళ మొహం చూడలేక సిగ్గుతో చచ్చాననుకోండి" అంటూ పకపకా నవ్వేశాడు విశ్వనాథం.

ఏది ఏమయినా భార్యను పరాయివాళ్ళ మధ్య అంతగా తీసిపారేయడం రజినికి నచ్చలేదు.

◆ ◆ ◆




విశ్వనాథం ఎవరింట్లోనైనా టిఫిన్‌కాని భోజనం కాని చేస్తే ఒక గంటసేపు వాళ్ళను పొగడకుండా మాత్రం ఇంటికి రాడు.

పెళ్ళయి పన్నెండేళ్ళయినా అతని భార్య కనీసం చారు కాయడం కూడా నేర్చుకోలేదని రోజుకొకసారైనా దెప్పి పొడుస్తూ వుంటాడు.

ఒకవేళ కాస్తే అది ఖచ్చితంగా పారాణి నీళ్ళలా వుంటుందని అందులో ఒక మిరప కాయ ముక్క కాని, నూనెబిడ్డకాని, ఒక్క పోపుగింజ కనపడటం కాని ఉండదు.

అదే విషయాన్ని చుట్టాలందరికి చెపుతూ ఎంజాయ్ చేస్తూ వుంటాడు.

అయితే అరుణకు వంటమీదకన్నా పొద్దున్నుండి రాత్రి పడుకునేంత వరకూ టీవీలో చచ్చుసీరియల్స్ చూస్తూ కాలక్షేపం చేయటం అలవాటు. అందులోని పాత్రలు తర్వాత చెప్పబోయే డైలాగులు ముందుగానే ఊహించి పొల్లుపోకుండా చెప్పగలిగే తెలివితేటలు మాత్రం మెండుగా వున్నాయి.

ఏదైనా పాత్ర అర్థాంతరంగా ముగిసినా, సీరియల్ అయిపోయినా ఆ రోజు వంటగది మొహం చూస్తే ఒట్టు. ఒక రకంగా ఆ రోజు విశ్వనాథంకు పస్తే.

అప్పుడప్పుడు అతను పెళ్ళానికి క్లాసు తీసుకుంటూ వుంటాడు.

"ఏమోయ్! మీ అమ్మకు వంటరాదు. మీ అమ్మమ్మకు కూడా తెలియదని విన్నాను... బహుశా వంశపారంపర్యంగా అది నీకూ వచ్చి వుంటుంది. అయితే నేను నీకో తరుణోపాయం చెపుతాను విను. వంటరాని వాళ్ళ కోసం భగవంతుడు బంగాళాదుంపను సృష్టించాడు. దాన్ని చెక్కుతీసి అడ్డంగానో, నిలువుగానో చీరేసి సలసలా కాగే నూనెలో వేసేసి కొద్దిగా కారం, ఉప్పూ చల్లేస్తే అది వేపుడై కూర్చుంటుంది. ఒకవేళ నీలాంటిది చెక్కు తీయడం కూడారాదని భావిస్తే చెక్కు తీయకుండా కూడా ఫ్రై చేసేయొచ్చు. ఏమీ రాదంటూ రోజూ నా దుంప తెంచేబదులు రేప



ట్నుంచి ఆ దుంపమీద పదు చచ్చినట్టు నోర్మూసుకుని తినేస్తాను" అంటాడు కడుపు మండిపోయి.

మొగుడి మాట బాగా పనిచేసిందను కుంటా. ఆ రోజు అరుణ టీవీ దగ్గరకెళితే ఒట్టు. వంటింట్లోనే ఏవో ఖూనీరాగాలు తీసు కుంటూ బంగాళా దుంపలను తరగటం మొదలుపెట్టింది.

ఎప్పుడైనా టీవీలో న్యూస్ చూద్దామంటే విశ్వనాథానికి అవకాశం రావడంలేదు.

పెళ్ళాం వంటింట్లో ఉండం చూసి గబగబా టీవీ దగ్గర కెళ్ళి న్యూస్ ఛానల్ ఆన్ చేశాడు.

అదీ అసలు విషయం.

కేబుల్ పోయి టీవీ రావడంలేదు. అది తెల్సే చేసేదిలేక 'ఖర్మ' అనుకుంటూ వంటింట్లోకి వెళ్లి వుంటుంది ఉత్తమ ఇల్లాలు.

విశ్వనాథం ఉసూరుమని నుదురుమీద కొట్టుకున్నాడు. బాగా ఆకలిమీదున్న అతనికి వంటింట్లో మూకుడులోని బొగ్గుముక్కలు దర్శనమిచ్చాయి.

'అబ్బ ఎంతగా మాడ్చేసింది. దీని దుంపతెగి పోనూ!' అనుకున్నాడు పైకి అనలేక.

◆ ◆ ◆

ఎల్‌టీసీ లాప్స్ అయిపోతుందని తెల్సుకున్న విశ్వనాథం హఠాత్తుగా విశాఖపట్నం ట్రిప్ పెట్టుకున్నాడు పెళ్ళాం పిల్లలతో.

మార్గ మధ్యంలో రెండురోజులు అత్తగారిం ట్లో బస చేయాల్సి వచ్చింది.

అత్తగారింట్లో భోజనం అయ్యాక "వంటలు బాగున్నాయా బాబూ!" అడిగింది అత్తగారు.

"వంటల మాటెలా వున్నా మంచినీళ్ళు మాత్రం బాగున్నాయి" అని అందామను కున్నాడు కాని ఎందుకో నోరు నొక్కేసు కున్నాడు.

పాపం ముప్పయ్యేళ్ళు పైపడి కాపురం చేస్తున్నా అరుణ తల్లికి అతిసాధారణమైన వంటకాలు కూడా కొత్తవిగానే అన్పిస్తూ వుం టాయి. చుట్టుప్రక్కల వాళ్ళను, ఇంటికొచ్చిన వాళ్ళను పొట్లకాయ ఎలా వండుతారూ? వంకాయ ఎలా చేస్తారు? పులుసెలా పెడ తారూ? అంటూ చచ్చుప్రశ్నలు వేసి తన అజ్ఞానాన్ని బయటపెట్టుకుంటూ వుంటుంది.

ఆ మహానుభావుడు ఆమె భర్తగారు అదే తన మామగార్ని చూస్తూంటే చేతులెత్తి దణ్ణం పెట్టి సాష్టాంగ నమస్కారం చెయ్యాలని పిస్తుం ది. ఆమెతో ఇన్నాళ్ళుగా కాపురం చేస్తున్నం దుకు.

అసలు వాళ్ళ తరంలో ఎవ్వరికి వంటల మీద పట్టు లేదుట. వంటల గురించి మాట్లాడు కోవడం అజ్ఞానుల పని అని భావిస్తారుట. ఒక రూపాయి ఆకు కూర కొనుక్కుని దాంట్లో బాగా పచ్చిమిరపకాయలు వేసి నూరి పచ్చడి చేసుకుని... పెద్ద గరిటెడు నూనె వేసుకుని... ముప్పొద్దులా కంచాలు కంచాలు లాగేసే వాళ్ళట.

అత్తగారింట్లో వున్న రెండురోజుల్లో పాపం ఆవిడ ఎలాగైనా కూతురికి గోంగూరపచ్చడి, ఆవకాయ పెట్టివ్వాలని తాపత్రయపడ సాగింది.

విశ్వనాథం వేపచెట్టుకింద వాలుకుర్చీ వేసు కుని పేపరు చదువుకుంటూ అత్తగారు పచ్చళ్ళు పెట్టటాన్ని క్రీగంట గమనిస్తూనే వున్నాడు.

ఈలోపు ఆవిడ ఆవకాయ పెట్టడంలో తల మునకలై వుంది. ఆవిడ కొడుకు ఆవకాయ కలపటానికి బాత్‌రూమ్‌లోంచి నల్లగా మడ్డి కట్టిపోయి వున్న ప్లాస్టిక్ బకెట్ తెచ్చి తల్లి ముందుంచాడు.

ఆవిడ లోపలికి వెళ్లి కారం తెచ్చేలోగా కొడుకు ఆవకాయ ఎక్కువవుతుందని ప్రక్కనే విడిగా వుంచిన పండిపోయిన ముక్కల్ని కూడా అందులో కలిపేశాడు. ఆవిడేసిన కారానికి, ఉప్పుకు, ఆవపొడికి ఏమాత్రం కొలతలు లేక భానుమతి అత్తగారి కథల్లోని అత్తగారి పాత్ర గుర్తుకు వచ్చింది విశ్వనాథానికి.

ఆవకాయ ప్రహసనం పూర్తయ్యాక ఇక గోంగూర పచ్చడి పెట్టడం మిగిలింది.

అప్పటివరకూ వేపచెట్టుకింద ఆరబెట్టిన గోంగూర పళ్ళెంలో ఎన్ని వేపాకులు... ఎంత దుమ్ము పడిందో అంతా గమనిస్తూనే వున్నాడు విశ్వనాథం.

వేడి వేడి అన్నంలో గోంగూర పచ్చడి వేసుకుని తినమని అత్తగారు బలవంతపెట్టడంతో ఆకలి సరిగ్గా లేకపోయినా తినక తప్పింది కాదు. అయిష్టంగానే వేలితో పచ్చడి నాకాడు.

అబ్బ! కాలకూట విషం. వీళ్ళ దుంపతెగిపోను. వేపాకులు, వేపకాయలు ఏరకుండానే పచ్చడి చేసేశారన్నమాట.ఇదేమీ పట్టనట్టుగా మామగారు, ఇద్దరు బావమరుదులు లొట్టలేసుకుంటూ గోంగూరపచ్చడన్నం తినేస్తున్నారు.

ఒకటి మాత్రం నిజం. వీళ్ళకు ఎంతటి విషజంతువు కరిచినా ప్రమాదం వుండదని అర్థమైపోయింది విశ్వనాథానికి.

ఇంటికి తిరిగొచ్చాక వెంటనే ఆ ఆవకాయ, గోంగూరపచ్చడి పనిమనిషికి ఇచ్చేంతవరకూ విశ్వనాథానికి మనసు ఊరుకోలేదు.

ఆ తర్వాత వారంరోజులు ఏదో ఫుడ్ పాయిజన్ జరిగిందంటూ పనిమనిషి పనికి ఎగనామం పెట్టిందనుకోండి. ఇంకా నయం, వాళ్ళకే దైనా అయ్యి కేసు పెట్టివుంటే... ఆలోచించటానికి కూడా భయమేసింది విశ్వనాథానికి.

ఇన్ని అవకతవకలు వున్నా, విశ్వనాథానికి భార్య అరుణంటే చచ్చేంత ప్రేమ.

అందుకే ఆవిడ మెడలో బోల్డంత బంగారాన్ని దిగేశాడు. ఈ చేతికి ఆ చేతికి ఐరవై ముప్పయి పైగా బంగారుగాజులు ఇంక్రిమెంట్ వస్తున్నప్పుడల్లా కొనిపారేస్తునే వున్నాడు.

అత్తామామలను ప్రతివారం ఒకసారైనా ఫోన్లో పలకరిస్తూనేవుంటాడు. 'శభాష్ విశ్వనాథం' అని అందరూ అనుకునేలా.



# రాంపాకు అరవయ్యేళ్ళు నిండాయట!





**'అందరూ మహాసుభావులే అందరికీ ఆరు పదులు నిండిన ఆనందాల వందనాలు.'**

అవి ఆ రోజు వేదికను అలంకరించిన అక్షరాలు.

రచయిత, చిత్రకారుడు, కవి, కార్టూనిస్టు- యింకా చాలా వున్నాయి రాంపా చేస్తున్న పన్లు.

ఎందుకయ్యా అన్నీ ఏదో ఒకటి చేయి పైకొస్తావంటే... పైకి పోయిందాకా పైకి రాక పోయినా ఫరవాలేదు. ఎందుకంటే భగవంతు డిచ్చిన పన్లు భగవంతుడికి నైవేద్యం చేయాల్సిందే అంటే ఆయా పన్లు చేస్తూ వుండడమే- అంటాడు.

బిర్లా ప్లానిటోరియంలో అది భాస్కరా ఆడిటోరియం.

రాంపా అనుభవాల 'సుధారస' అనే పుస్తకాన్ని ఆయన చొక్కా లోపలనుంచి బయటికి తీసి ఆవిష్కరించారు శ్రీ అల్లాణి శ్రీధర్.

ఆ రోజు సభకు విచ్చేసిన శ్రీమతి రోజారమణి, సి.భవానీదేవి, అల్లూరి గౌరీలక్ష్మి, భండారు విమలాదేవి, భండారు సరోజినీ దేవి, వనం విజయలక్ష్మీ, కె.ఒ.లక్ష్మిగార్ల వరసకు పూలు చల్లి, వందనం చేసి 'స్త్రీశక్తి'కి పూజ అన్నాడు రాంపా.

ఆ వరుసలో రాంపా శ్రీమతి ఫణి కూడా వున్నారు. ప్రముఖ హరిదాసు శ్రీ పండు గారికి, రాంపాని హైదరాబాద్‌లో ప్రవేశ పెట్టిన భండారు రామభద్రారావుగార్లకు సత్కార కృతజ్ఞతాభివందనం చేశారు.

***లైఫ్ ఈజ్ ఎ క్రానిక్ డిసీజ్ లాఫ్ ఈజ్ ది బెస్ట్ మెడిసిన్ విత్‌అవుట్ ఎ ఎక్స్‌పైర్ డేట్*** అనే రాంపా ఆదర్శాలకి తగ్గట్టుగా వేడుక ఆసాంతం ఆనంద వాతావరణంలో జరిగింది.

ఉపన్యాసాలు లేని సభాదీపిక, ఆత్మీయులు జగమేలు కలయిక అని రాంపా కుమారుడు చి॥ గంధర్వ (బయోటెక్ ఇంజనీరింగ్ ఫైనలియర్) పేరిట వచ్చిన ఆహ్వానాన్ని మన్నించి విచ్చేసిన, మిస్సైన ప్రముఖులు ఎవరు ఎందుకని కాకుండా ఈ వేడుకకు ప్రాచుర్యాన్ని ఆశించలేదు.

అయితే తెలియకుండా తెలుసుకున్న 'హాస్యానందం' ఆ సంపూర్ణ కళాకారుడికి అభినందనగా ఈ నాలుగు మాటలు హాస్యప్రియులందరికీ అందిస్తోంది.

## చేతికర్రావలంబం

(రాంపా రాసిన చేతికర్రపాట పాట)

ఒడలొడలి పోదని విర్రవీగిన
నా బట్టతలపై మొట్టికాయవై
బుర్రకు పట్టిన వంకర కంకరను
చదును చేయగ విచ్చేసినావు
వంకరకర్రవై, చేతికర్రమ్మా నీ
చేతులొత్తి నీకు చేతులెత్తి మొక్కెదనమ్మా-
చేతికర్రమ్మా

చలనాచలన గమన విలంబనాలంబనా
నా ప్రాణ ప్రణతులందుకొమ్మా, ఏ కొమ్మ
నుండో విడివడి నా అడుగులు
సరిచేయుగ చేయి చేరినావమ్మా,

అమ్మా ఈ బొమ్మ రంగు
వెలసిపోయేదాక నన్ను పట్టుకొనుండమ్మ
పట్టుగొమ్మా - చేతికర్రమ్మా

నే హవ్యవాహనునికి ఆహారమై
పవనానంద వినోదమై
వినువీధి విహారమైపోవు
నా ఆత్మసాక్షిగా నిన్ను పూజించెదనమ్మా -
చేతికర్రమ్మా

అండపిండ బ్రహ్మాండాలు అండగా
వుండగా నిండగా

నువ్వు లేకుండ నేనుండలేనమ్మ నిండుగా
నవ్వు నివ్వమ్మ, నవ్వునివ్వమ్మ, నువ్వు
నవ్వమ్మ

ఇది నువ్వు నవ్వమ్మ నవ్వు దివ్యౌషధమ్ము
కదమ్మ

నరనారీ నరహరి నారాయణ వైద్యమమ్ము
ఆ వైద్య వృత్తిలో నన్నుండ నీవమ్మ -
అమ్మా - చేతికర్రమ్మా!



నవ్వుల రారాజు ఫ్లాష్‌బ్యాక్

# చార్లీచాప్లిన్ దగ్రేట్!

విష్ణుభొట్ల రామకృష్ణ
ఫోన్: 9 4 4 0 6 1 8 1 2 2

చాప్లిన్ విజయ పరంపరకు నిదర్శనం 1941వ సంవత్సరం ప్రముఖ సినిమా కంపెనీ కీస్టోన్ రెండు రీళ్ళ చిత్రాలను చాప్లిన్‌తో తీయాలని నిర్ణయించింది.

ఆ కంపెనీలో చాప్లిన్ దాదాపు 35 చిత్రాలలో నటించాడు. అప్పటికే చాప్లిన్ పేరు ప్రఖ్యాతులు అమెరికాలో వున్న ప్రఖ్యాత సినీ దర్శకులు, సినీతారలకు తెలిసింది.

దాదాపు అన్ని ప్రముఖ స్టూడియో అధిపతులను చాప్లిన్ విజయ పరంపర తెలిసింది. దీనితో వారందరూ చాప్లిన్‌తో పరిచయం పెంచుకొనేందుకు ఉత్సాహం చూపేవారు. అతనిని తమ చిత్రాలలో నటించమని అడగసాగారు.

ఇంతటి పేరు ప్రఖ్యాతలు తెచ్చుకొనేటప్పటికి చాప్లిన్ వయస్సు కేవలం 25 సంవత్సరాలు. అంటే పిన్నవయస్సులో ప్రఖ్యాత నటుడు అయ్యాడు చాప్లిన్.



సినిమా నటుడు కావాలని కలలు కన్న తన కోరిక నెరవేరినందుకు తన దృష్టిని తన అన్న అయిన సిడ్నీపై నిలిపాడు.

చిన్నతనం నుండి కష్టాలలో తోడు నిలిచిన సిడ్నిని కూడ ఆర్థికంగా అభివృద్ధి చేయటానికి తన వంతు కృషి తాను చేయదలిగాడు. అందు కోసం అతడు తన అన్నగారైనా సిడ్నీని అమెరికాకు రప్పించాలని నిర్ణయించాడు.

సిడ్నీకి అప్పటికే వివాహం అయినది. చిరు సంపాదనతో అతను ఇంగ్లాండులోనే వుంటున్నాడు. చాలీచాలని సంపాదనతో వున్న సిడ్నీని అమెరికాకు రప్పిస్తే తనతోపాటు సంపాదిస్తాడని తలచిన చాప్లిన్, తనకెంతో అప్పుడయినా సెన్నెట్‌కు ఈ విషయం వివరించి, తన అన్నకు వారానికి 200 దాలర్లు ఇచ్చి అతని దగ్గర పనిచేసేట్లు ఒప్పందం కుదుర్చుకొన్నాడు. సిడ్నీ కూడ నటుడు కావటం వలన అవకాశం లభించటం కోసం పెద్ద కష్టపడాల్సిన పని లేకుండా పోయింది.

చాప్లిన్ చిత్రాల విజయం గురించి ఇంగ్లాండు ప్రజలు ఏమనుకొంటున్నారు, ఎలా మెచ్చుకుంటున్నారు, చాప్లిన్ నటన గురించి అక్కడి ప్రేక్షకుల అభిప్రాయాలను సిడ్నీ అమెరికాకు వచ్చి చాప్లిన్‌కు వివరించాడు.

అతని చిత్రాలకు ఇంగ్లాండులోకూడా ఆదరణ పెరుగుతోందని, పేరు ప్రఖ్యాతులు ఇప్పుడిప్పుడే బాగా వస్తున్నాయని ఆనందంతో చాప్లిన్‌కు వివరించాడు అన్న సిడ్నీ.

ఆ తర్వాత సిడ్నీ కూడా చాప్లిన్ వలే కష్టపడి సినిమా నటునిగా మంచి పేరు తెచ్చుకొన్నాడు.

అతనికి కూడ అమెరికాలోని సినిమా కంపెనీలలో సినిమా అవకాశాలు ఎక్కువగా రాసాగాయి. దీనితో అన్నదమ్ములిద్దరూ సినిమా ప్రపంచాన్ని ఏలసాగారు.

ఇద్దరు నటించిన సినిమాలు విజయవంతం కావటం చాప్లిన్‌కు ఆనందం కల్గించి.

ఒకప్పుడు తాను, తన అన్న సిడ్నీ కలసి అనుభవించిన చేదు అనుభవాలను ఎన్నో ఆకలిరాత్రులను, సవతి తల్లి బాధలను, కన్న తల్లి అనారోగ్యాన్ని, అన్నదమ్ముల మధ్య ఎడబాట్లు వంటి అనేక ఆటుపోట్లనుండి ఈనాడు తాము జీవితంలో స్థిరపడటం చాప్లిన్‌కు సంతో

షాన్ని కల్గించినది.

అనేక విజయాలు సాధించిన తర్వాత ఎవరైనా తమతోటి వారిని మరచిపోవడం సహజం. కాని చాప్లిన్ మాత్రం తాను సినిమా నటునిగా విజయం సాధించిన వెంటనే తనతో పాటు కష్టాలను అనుభవించిన తన అన్న జీవితాన్ని సరిదిద్దాలని ప్రయత్నించటం నిజంగా చాప్లిన్‌కి సోదరునిపై గలప్రేమాభిమానాలకు నిదర్శనం.

ఈ క్రమంలో అన్నదమ్ములిద్దరూ సినీ ప్రపంచాన్ని ఏలుతున్నప్పుడు చాప్లిన్‌కు క్రిస్టోన్ కంపెనీలో సెన్నెట్‌తో మళ్ళీ చిత్రాలలో నటించే అవకాశం వచ్చింది.

ఇది ఒకవిధంగా చాప్లిన్‌కి ఒక మంచి అవకాశం. చాప్లిన్‌కి సెన్నెట్‌కు మధ్య సినిమా ఒప్పందం కుదిరింది. కాని డబ్బు దగ్గర ఇద్దరికి మాట కుదరలేదు.

చాప్లిన్ వారానికి వెయ్యి డాలర్లు ఇస్తే తను మీ స్టూడియోలో నటిస్తానని తెగేసి చెప్పాడు.

కాని వారానికి అన్ని డాలర్లు ఇవ్వలేనని, తగ్గించి ఇస్తాను నటించమన్నాడు సెన్నెట్.

ప్రస్తుతం తన సినిమాలకు వున్న డిమాండ్‌ను దృష్టిలో వుంచుకొని తాను చెప్పిన వారానికి వెయ్యిడాలర్లకు తగ్గి నటించటానికి చాప్లిన్ ఇష్టం చూపలేదు. దానితో వారిద్దరి మధ్య సినిమా ఒప్పందం రద్దయినది.

దీనితో చాప్లిన్‌కి ఒక ఆలోచన వచ్చింది. ఎవరి దగ్గరో డబ్బులు తీసుకుని వారి వద్ద నటించే కన్నా తన అన్న సిడ్నీ దర్శకత్వంలో తామే సినిమా నిర్మిస్తే పోతుందనే ఆలోచన వచ్చింది.

వెంటనే సిడ్నీని కలసి తన ఆలోచనను వివరించాడు. సిడ్నీ కొంత తడవ ఆలోచించి ఇప్పుడిప్పుడే ఎదుగుతున్న మనం సొంతసినిమా తీయగలమా? అంత పెట్టుబడి పెట్టినా విజయం సాధించగలమా? అనే సందేహాలను వెలిబుచ్చటంతో సొంత సినిమా తీయాలి అనే ఆలోచనను విరమించాడు చాప్లిన్.

చాప్లిన్ నిర్ణయాలు పాదరసంలా చాలా స్పీడుగా, స్పష్టంగా వుంటాయి అనేదానికి నిదర్శనం తన ఎంతో అభిమానించే సెన్నెట్‌కి అతనికి స్వల్ప మూల్యం విషయంలో తేడా రావటంతో. సెన్నెట్ చిత్రాలలో నటించటానికి ఒప్పుకోలేదు. **(ఇంకావుంది)**





తన అన్న సిడ్నీతో చాప్లిన్




# మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ బ్యూరోస్!

టీవీయస్. శాస్త్రి

'పెళ్లి చేసి చూడు,ఇల్లు కట్టి చూడు' అనే సామెత మనందరికీ తెలిసిందే!

ఇల్లు కట్టటం గురించి మరొకసారి ముచ్చటించుకుందాం. ప్రస్తుతం పెళ్లి చేయటం గురించి ముచ్చటించుకుందాం.

ఈ రోజుల్లో అన్నిటికన్నా తేలికయినది,పెళ్లి చేయటమే! పూర్వపు రోజుల్లో, ఆడపిల్ల కల వాళ్ళు వరుని వెతకటం కోసం చెప్పులరి గేటట్లు తిరిగే వారు. ఈ రోజుల్లో అంతా ఇంట్లో నుంచే చేసుకోవచ్చు. మాయాజాలం లాంటి అంతర్జాలం(Internet) వచ్చిన తరువాత, ఈ వివాహ తంతులు అతి సులభం అయ్యాయి. వివాహ సంబంధాల కోసం, చాలా సైట్స్ వున్నాయి. అదీగాక,'క్విక్ మారేజ్' సంస్థలు పేటకు రెండు మూడు వున్నాయి.

వధూవరుల వివరాలు ప్రకటించే కొన్ని సంస్థలు కూడా వున్నాయి. ఇన్ని సౌలభ్యాలు వున్న ఈ రోజుల్లో పెళ్లి చేయటం కష్టం ఎలా అవుతుంది? ఈ రోజుల్లో పెళ్ళిళ్ళలో పెద్దల ప్రమేయం చాలా తక్కువ.

పిల్లలే వారికి తగిన జోడును నెట్‌లో వెతుక్కుంటారు. గోత్రము, ఎత్తు, రంగు, బరువు, వయసు, చదువు,వుద్యోగం, జీతం... అన్నిటినీ మించి ఫోటోలు కూడా వుంటాయి. అన్నీ బాగానే వున్నాయి.

ఈ ఫోటోల దగ్గరే మనం బోల్తా పడుతుంటాం. ఈ మధ్య వచ్చిన డిజిటల్ టెక్నాలజీ ద్వారా అల్లురామలింగయ్యను అల్లు అర్జున్‌గా చూపించవచ్చు. అమ్మాయిని ఐశ్వర్యరాయిగా చూపించవచ్చు. అటువంటి అందమైన ఫోటోలను ఈ సైట్స్‌లో పెడతారు. సరే, వధూవరులకు ఒకరి వివరాలు మరొకరికి పూర్తిగా నచ్చాయి. తల్లితండ్రులకు కూడా నచ్చుతాయి. ఎందుకంటే, ఏదో ఒకవిధంగా పెళ్లి చేయటం కావాలి వారికి. ఈ కాలపు పిల్లలు ఒక పట్టున దేనికీ ఒప్పుకోరు. ఈ పెళ్లిళ్లకు మధ్యవర్తులు, తెలిసిన వారు వుండరు.




తరువాతి కార్యక్రమం పెళ్లి చూపులు. వధూవరులు ఒకరినొకరు ప్రత్యక్షంగా చూసు కోవటమన్నమాట. వారివారి తల్లితండ్రులు కూడా ఒకరినొకరు చూసుకోవటం. (పూర్వం, ఫలానా చోట వరుడు వున్నాడని తెలుసుకొని, వధువు తండ్రి వెళ్లి,వారి ఇల్లూ, వాకిలీ, సంప్రదాయం, పెళ్లి కుమారుడిని చూసి, ఆయనకు ఇవన్నీ నచ్చిన తరువాతనే, మిగిలిన కార్యక్రమాలన్నీజరిగేవి).

పెళ్లికొడుకుది హైదరాబాద్, పెళ్లికూతురిది అనకాపల్లి.

"ఫలానా రోజున అమ్మాయిని చూడటానికి వస్తున్నాం, మాకు లాడ్జిలో ఒక గది బుక్ చేయండి, స్టేషన్‌కు వచ్చి మమ్మల్ని రిసీవ్ చేసుకోండి!"అని సెల్ ఫోన్ ద్వారా ఆడ పెళ్ళివారికి మగపెళ్లి వారు తెలియపరుస్తారు.

సరే, ఆ 'ఫలానా'రోజు రానే వచ్చింది. పెళ్లికూతురి తల్లితండ్రులు మగ పెళ్లివారిని రిసీవ్ చేసుకోవటానికి స్టేషన్‌కు వెళ్ళారు. ఇంతవరకూ బాగానే వుంది. మగ పెళ్లివారిని గుర్తించటం ఎలా?

పెళ్లికొడుకు ఫోటో చూశాం కదా, గుర్తించటం అతి సులభం అనుకున్నారు. బ్రహ్మ ప్రయత్నం చేశారు, గుర్తించటం వాళ్ళ వల్ల కాలేదు.ప్రయాణీకులందరూ వెళ్లి పోయారు. రైలు కూడా వెళ్లి పోయింది. అక్కడ బల్ల మీద కూర్చొని ఒక నలుగురు, ఆ పక్కనే పడుకున్న మరో నలుగురు బిచ్చగాళ్ళు మాత్రం మిగిలారు. పెళ్లికొడుకు తండ్రికి వళ్ళు మండిపోయింది. అసలే ఎండాకాలం కూడా! జేబులోంచి సెల్ ఫోన్ తీసి పెళ్లికూతురి తండ్రిని ఎడాపెడా వాయించాడు–

"ఇదేమన్నా మర్యాదగా వుందా?స్టేషన్‌కు వస్తామన్నారు. ఒక్కళ్ళు కూడా తగలబడలేదు. మీకు ఇష్టం లేకపోతే చెప్పండి ఇటునుంచి ఇటే వెనక్కి వెళ్ళతాం."

ఫోన్ అందుకున్న పెళ్లికూతురి తండ్రి వెంటనే,"బావగారూ!మేము మీ వెనకనే తగలపడ్డాం. ఇంతకు ముందు మనం ఒకరినొకరం చూసుకోకపోవటం వల్ల ఈ అసౌకర్యం కలి

గింది. పెళ్లి కొడుకు ఫోటోను చూశాం కానీ, అతను వచ్చినట్లు లేదు. అందువల్ల మీకు కలిగిన అసౌకర్యానికి చింతిస్తున్నాం."అని చెప్పిన వెంటనే ఒకరినొకరు గుర్తించారు.

అలా తగలపడటంతోనూ, చింతించటంతోనూ వారి కుశల ప్రశ్నలు మొదల య్యాయి.

"పెళ్లి కొడుకు రాలేదా?" అని పెళ్లి కూతురి తండ్రి ప్రశ్నకు, పెళ్లికొడుకు తండ్రి -"ఈ వెధవే ఆ పెళ్లికొడుకు" అని ఆ వెధవను చూపించాడు.

"ఫోటోలో మరో రకంగా వున్నాడే!"అని పెళ్లికూతురి తండ్రి సందేహం వెలిబుచ్చాడు.

బొగ్గు రంగులోనే వున్నారు.

వారిని లాడ్జి వద్ద వదలివేసి,"విశ్రాంతి తీసుకొని, స్నానంచేసి పెళ్లిచూపులకు రండి!" అని ఆహ్వానించి పెళ్లికూతురి తల్లితండ్రులు వెళ్లిపోయారు.

సాయంత్రం పెళ్లిచూపులు ఏర్పాటు చేశారు. మగ పెళ్లివారు పెళ్ళికూతురుని చూసి,-"అమ్మాయి ఫోటోలో వున్నట్లు లేదే!" అని సందేహం వెలిబుచ్చారు.

అమ్మాయి బహు'లావణ్యవతి'. లావణ్యవతి అంటే లావుగా వున్నదన్నమాట. అమ్మాయి, అబ్బాయిలు ఒకరినొకరు వింతగా చూసుకుంటున్నారు.

తీసుకుంటే సరిపోతుంది కదా!అని నిర్ధారించుకొని, నిర్ణయించుకొని,ఆ కార్యక్రమం కూడా పూర్తి చేస్తారు.

ఆ కార్యక్రమంలో బంధువులు ఎవ్వరూ వుండరు. ఏదో ఒక హోటల్ కు వెళ్లి భోజనం చేసి వస్తారు.

ఈ రోజుల్లో దీన్నే 'నిశ్చితార్థం' (Engagement) అని అంటారట.

సాయంత్రం పూట, కొద్ది వినోదం కూడా కలిగిస్తారు. అది ఎలా అంటే, చుట్టుపక్కల వాళ్ళను కొంతమందిని పిలుస్తారు. కాబోయే వధూవరులను, పక్కపక్కనే కూర్చోపెట్టి, ఒక కూల్ డ్రింక్ సీసాలో రెండు స్ట్రాలు వేసి, వారిద్దరూ తాగుతుంటారు (కూల్ డ్రింక్‌ని).



"ఏమి చెప్పమంటారు! బావగారు! ఈ వెధవలు మనం చెప్పినట్లు వింటారా! హైదరాబాద్ లో ఎండాకాలంలో హెల్మెట్ లేకుండా మోటర్ బైక్ మీద వెళ్ళుతుంటారు. వాతావరణ కాలుష్యం వల్ల కొద్దిగా నల్ల పడ్డాడు. చిన్నప్పుడు మల్లెపువ్వులాగా వుండేవాడు, ఇప్పుడేమో! మసిబొగ్గులా తయారయ్యాడు." అని పెళ్లి కొడుకు తండ్రి సమయోచితంగా తన కొడుకు సౌందర్యాన్ని గురించి వివరించాడు.

పెళ్లి కొడుకు తల్లితండ్రులు కూడా మసి

"కొద్దిసేపు మేము ఏకాంతంగా మాట్లాడుకోవాలి" అని పెద్దల అనుమతి తీసుకొని, ఏమి మాట్లాడుకున్నారో ఏమో,"మా యిద్దరికీ ఒకరికొకరం నచ్చాం! మిగిలిన ఏర్పాట్లు చేయండి." అని యుగళగీతం పాడారు.

సరే! ఒకరికొకరు నచ్చారు కదా! మళ్ళీ సెలవలు దొరకటం కష్టం. మీరూ, మేమూ ఇంతదూరం ప్రయాణం చెయ్యడం కూడా కష్టం... కనుక 'కిళ్ళీలు' (అదే తాంబూలాలు)

సరే,వారు సిగ్గులేకుండా తాగుతుంటారు.

మనకు సిగ్గు కలుగుతుంది. నా లెక్క ప్రకారం, వారికి జరిగింది 'నిశ్చితార్థం' కాదు. నిశ్చితార్థం తరువాత జరగ వలసిన పెళ్లిని కూడా దాటి, ఏకంగా 'శోభనమే' జరిగినట్లు నా భావన. కావాలంటే,'శృంగార శాస్త్రాలు' చూడండి!

ఇంక తదుపరి కార్యక్రమాలు, ముహూర్త నిర్ణయం, పెళ్లి ఏర్పాట్లు.

భువన్

# అల్లుళ్ల పండుగ















పాతతరం హాస్యాన్ని ఈ తరం వాళ్ళకి పరిచయం చేయడమే ఈ నాటి నవ్వులు...




# ఎక్కడ? నటరాజెక్కడ?

**-ఆదివిష్ణు**

**టి**క్కెట్టు కొని నాటకం చూడటమంటే నాకు చెడ్డచిరాకు. నా వంటి కది బొత్తిగా పడదు కూడాను! రెండుగంటలు నాటకానికి అయిదో పదో తగలేయడం క్రిమినల్ వేస్టంటాను!

కళోద్ధరణ కోసం కంకణం కట్టుకున్న సభ్యులు చాలా నన్ను తమ సభ్యుడిగా చేర్చుకోవాలని ముచ్చటపడ్డాయి.

నెలకో అయిదు చొప్పున చందా కట్టమన్నారు. సంవత్సరానికి మీకు పదో పరకో నాటకాలు చూపెడతామన్నారు. దేశంలో చలామణీ అవుతూన్న గొప్పగొప్ప నాటకాలూ, ప్రఖ్యాత నటీనటులు మిమ్మల్ని ఉత్సాహ పరుస్తారని హామీలు కూడా యిచ్చారు.

ఎంతైనా చెప్పండి, ఈ పద్ధతి నాకేం రుచించలేదు. అయినా, చందాల్తో ఎన్నేళ్ళు బతుకుతాయట ఈ నాటకాలు?

రెండురూపాయలు మనవి కావనుకుంటే ఎంచక్కా సిమ్లాలూ, కాశ్మీర్లూ, సినిమాల్లో చూసేసుకోవచ్చు. అక్కడ గడ్డిమీదా, కొండల మీదా హీరో హీరోయిన్లు ఒకరి వెంట ఒకరు పరుగెడుతూ, పడుతూ లేస్తూ, పాటలూ అవీ పాడుకుంటుంటే మనమే ఆ హీరోగా అనుకొని ఊరికే మురిసిపోవచ్చు కూడాను.

అందులో ఉన్న థ్రిల్లు నాటకాల్లో ఎందుకుంటుంది చెప్పండి!

అలాంటప్పుడు ఈ వేలాది నాటకాలూ, వందలాది రచయితలూ, లక్షలాది నటీనటులూ ఎవర్ని ఉద్ధరించను!

అందుచేత, దిక్కుద్చి నాటకాలు చూడకూడదని గట్టిగా ఒట్టేసుకున్నాను. ఎవడైనా టిక్కెట్టు అంటగట్టడానికి వస్తే, వాడి ఖర్చుమీద కాఫీ తాగేసి బాబ్బాబు, నీకు దణ్ణం పెడతాను, నన్నొదిలెయ్... అంటూ బతిమిలాడి పంపుతున్నాను.

నిజం చెప్పాలంటే... నాటకం చూడాలనే ముచ్చట గుండెల్లో గుచ్చు కుంటూనే వుంటుంది. నాటకం ప్రదర్శించే చివరిక్షణం వరకూ ఆశగా చూస్తాను. కాంప్లిమెంటరీ పాస్ కోసం!

ఎవడైనా దయతలిచి ఇచ్చేదా ఇస్తాడు. లేక పోతే, గమ్మున నేనెట్లా వూరుకుంటాను?

తెల్లటి ఇస్త్రీ బట్టలు వేసుకుని, ఆకుచెప్పుల్తో నోట్లో సిగిరెట్టు పెట్టుకుని హాలుముందర ఎవరెవర్తోనో అనవసరంగా మాటాడేస్తూ, ఓ కన్ను మాత్రం ప్రవేశద్వారం వైపు వేసివుంచుతాను. ఛాన్స్ తగిల్తే ఎవడో ఒకడు నా భుజమ్మీద చేయివేసి చనువుగా లోపలికి తీసుకుపోతాడు. లేదూ, జానే దేవని మిరపకాయ బజ్జీలు కొనుక్కుని వంతెనెక్కుతాను. అంతకంటే కాలక్షేపం ఏమి కావాలి గనుక!

ఇట్లాంటి నిప్పులాంటి చరిత్రలో మండిపోతున్న నన్ను నా ఫ్రెండు పడగొట్టేశాడు.

మామూలుగా అయితే పడేవాణ్ని గాదు. వాడు నన్ను నానా మాటలూ అన్నాడు. నాలాటి నాటక కళాద్రోహిని నడిరోడ్డుమీద ఉరి తీయాలన్నాడు. ఇవాళ నాటకానికి టిక్కెట్టు కొనకపోతే నా గొంతు పిసికి చంపుతానన్నాడు. నాకు పదీ పరకా అప్పు అవసరమై అడిగితే నా మెడపట్టుకు గెంటుతానన్నాడు. వాడు ఏవన్నా ఖాతరు చేయనుగానీ, అప్పు సంగతి అడ్డంపెట్టుకుని రెచ్చగొట్టినప్పుడు చచ్చినట్టు అంగీకరించవలసి వచ్చింది.

సరే కానివ్వమన్నాను, కన్నీళ్ళు పెట్టుకుంటూ...

థియేటర్ దగ్గిర రిక్షా దిగి బుకింగ్‌వేపు నడిచాము. ఓడిపోయానన్న దిగుల్తో అశాంతితో అన్నాను.

"ఒరే, నాచేత ఇష్టం లేని పని చేయిస్తున్నావు. ఆల్‌రైట్... నా టిక్కెట్టు కూడా నువ్వే కొను!"



